ప్రథమ
పంచవర్ష ప్రణాళిక

# ప్రశ్నోత్తరములు



ప్లానింగ్ కమిషన్
రాష్ట్రపతి భవనం
న్యూఢిల్లీ

# సామాన్య సంగతులు

ప్రశ్న. పంచ వర్ష ప్రణాళికయొక్క ప్రధానాశయము లేమి? సామాన్యమానవుడు దానివల్ల పొందగల లాభమేమి?

ఉత్తరం. యెక్కువ ఉత్పత్తిచేసి, లభ్యపడెడు సంపదను యెక్కువ న్యాయసమ్మతముగ పంచిపెట్టుట మూలమున సంఘమునకు గొప్ప అభివృద్ధి, సాంఘిక న్యాయము, కలుగునట్లు చేయుటయే యీ ప్రణాళికయొక్క ప్రధానాశయములుగ నున్నవి. సమానమైన అవకాశములు, సాంఘిక న్యాయము, పనిజేయుటకును, తగినంత వేతనమును పొందుటకును హక్కు, కొంతవరకు సాంఘిక భద్రత, ఇత్యాదులపై ఆధారపడియుండు ఆర్థిక, సాంఘిక క్రమమును సాధించుటపై కృషి చేయవలెనని రాజ్యాంగము ప్రభుత్వమును ఆదేశించుచున్నది. ఈ ఆశయములను రూపొందించుటకే యీ ప్రణాళిక ఉద్యమించుచున్నది. దేశము సౌభాగ్యవంతమై యుండునేని, సంపద, అవకాశము, యెక్కువ న్యాయముతో సరిసమానముగ పంచిపెట్టబడునేని, సామాన్య మానవుని స్థితికూడా మేలుగా నుండగలదు.

ప్ర. "అధికోత్పత్తి." "ఎక్కువ న్యాయ సమ్మతముగ పంచిపెట్టుట." యీ రెండును ముఖ్యమని ప్రణాళిక యెంచుచున్నదా?

ఉ. ఔను, యేలననగా. ఉత్పత్తినిమాత్రమే హెచ్చించుటకు ఉద్దేశించు కార్యక్రమమువల్ల హెచ్చిన సంపదలో అధికభాగము కొందరి చేతికిమాత్రమే పోయి, ప్రజలలో అధిక సంఖ్యాకులు నేడున్న దారిద్ర్యా

వస్థలోనే యుండగలరు; ప్రస్తుతము వున్న సంపదను మాత్రమే విభజించినయెడల ప్రజాసామాన్యముయొక్క స్థితి బాగుపడజాలదు. సంఘములో కొన్ని భాగములవారి స్థితిమాత్రము అధ్వాన్నము కాగలదు. కావున, యీ కార్యక్రమము రెండు ముఖములను గలిగియున్నది. ఈ కార్యక్రమమువల్ల అధికోత్పత్తియును, అసరిసమానతల ఒగ్గుదల యును, యేక కాలమున జరుగును. ప్రారంభదశలో యెక్కువ వుత్పత్తికే ప్రాముఖ్యత యివ్వబడినను, ఆర్థిక సరిసమానతలు క్రమముగా యేర్పడుటకై సాంఘిక నిర్మాణములో అనుకూలమైన మార్పులను ప్రవేశపెట్టుటకు ప్రారంభదశలోనే చర్యలు పుచ్చుకొనబడవలెను.

ప్ర. ఎక్కువ ఉత్పత్తి అగునట్లు చేయుటకై యీ ప్రణాళిక చేయ నుద్దేశించిన దేమి?

ఉ. ఒక సంఘముయొక్క ఉత్పత్తి మట్టము, దానివద్దనుండు సాధన సంపదపై ఆధారపడియుండును. అనగా, ఒక్కొక్కరును కలిగియుండు వ్యవసాయ యోగ్యమైన భూమి, లభ్యపడెడు సహజ సంపదలు, ఫాక్టరీలు, ఇంజెన్లు, యంత్రములు, నీటిపారుదల సౌకర్యములు, విద్యుచ్ఛక్తి స్థాపనలు, రాకపోకల సదుపాయములవంటి ఉత్పత్తి సాధనోపాయములు, ఇత్యాదులపై ఒక సంఘముయొక్క ఉత్పత్తి మట్టము ఆధారపడియుండును. సాధన సంపద హెచ్చి, దానిని మిగుల లాభకరముగ సద్వినియోగపరచుటకు జ్ఞానము కలిగినయెడల వస్తూత్పత్తియును, సేవలును హెచ్చగలవు. కాబట్టి ప్రణాళిక కాలములో వెచ్చింపబడు మూల ధనమునందు అధికభాగమును, యిదివరకు నిర్వచింపబడిన రీతిగా సాధన సంపదల నిమిత్తముగనే వ్యయపరచుటకు ఉద్దేశించబడియున్నది. ఉదాహరణమునకు, బంజరు భూములను

వ్యవసాయ యోగ్యముగా చేయుటకును, నీటిపారుదల సౌకర్యములను పెంపొందించుటకును, విద్యుచ్ఛక్తి సరఫరా, రాకపోకల మార్గములను, అభివృద్ధి చెందించుటకును, ఉత్పత్తికిని, వినియోగమునకును అను కూలించు వస్తువులను ఉత్పత్తిజేయు పరిశ్రమలను స్థాపించుటకును, ఇతర పరిశ్రమలను భారీ పరిశ్రమలను, చులకన పరిశ్రమలను — పెంపొందించుటకును, ప్రస్తుతము నిష్ప్రయోజనకరముగానున్న సహజ సంపదలను, మనుజశక్తిని, వుపయోగించునట్లు చేయుటకును, స్కీములు గలవు.

ప్ర. ఆర్థిక సరిసమానత హెచ్చుగా యేర్పడుటకై యీ ప్రణాళిక ఎచ్చుకొన నుద్దేశించిన చర్యలేవి ?

ఉ. ఈ సంబంధముగ చేయబడిన ముఖ్యసూచనలు ఇవి :

(1) భూముల యాజమాన్యము, నిర్వహణల విషయములో కొన్ని గొప్పమార్పులు సూచించబడెను.

(2) ఉత్పత్తి, పంపకములలో నానా క్రియలను జరుపుట యందు సహకార సంస్థలను పెంపొందింపవలెననుటకు ప్రాముఖ్యత యొసగబడెను.

(3) ఒక క్రమపద్ధతిలో యేర్పడెడు ఆర్థిక వ్యవస్థయొక్క అవసరములను దీర్చుటకు వ్యాపారము, పరిశ్రముల వ్యక్తులభాగములో ప్రభుత్వముయొక్క అదుపు, ఆజ్ఞలను హెచ్చించుటకు వుద్దేశించబడియున్నది.

(4) మరణ సుంకములు, ఇతర అభివృద్ధికరమైన పన్నులు విధింపబడవలెనని యీ ప్రణాళిక సూచించుచున్నది.

వానిమూలమున కొంతకాలములో అసమానతలు చాలావరకు తగ్గిపోగలవు.

(5) కొన్ని ముఖ్యమైన వస్తువుల విషయమైనసున్న కంట్రోళ్లను చక్కగా రక్షించవలెనని యీ ప్రణాళిక సూచించుచున్నది. ఆ వస్తువులు కొరతపడినయెడల సంఘములోని పేద తరగతులవారికి కష్టము గలుగును గనుక ఆ సిఫారసు చేయబడెను.

ప్ర. ఈ ప్రణాళిక, కేవలము ఆదిభౌతికమైన అభివృద్ధిని మాత్రమే సాధింప గోరుచున్నదా ?

ఉ. ఆదిభౌతికమైన అభివృద్ధికిమాత్రమే యీ ప్రణాళిక పరిమితిని గలిగియుండుటలేదు. సాంఘిక, పరిజ్ఞానాభివృద్ధికిని, మానవశక్తుల వికాసమునకును, అనుకూలించు పరిస్థితులను కల్పించుటకుకూడా యీ ప్రణాళిక సంకల్పించుచున్నది. కాని, మిక్కిలి పరిజ్ఞానసంపన్నమైన సంఘము, ఆదిభౌతికమైన అభ్యున్నతి లేనిదే యేర్పడజాలదు. కనుక, ఆర్థికాభివృద్ధికే యీ ప్రణాళికయందు మొదట ప్రాముఖ్యత యివ్వబడి యున్నది.

ప్ర. ఈ ప్రణాళిక యథార్థముగా జాతీయతకును, ప్రజా ప్రభుత్వమునకును అనుగుణమైనదేనా ?

ఉ. ఒక ప్రణాళిక జాతీయమైనదిగను, ప్రజాప్రభుత్వ అనుగుణమైనదిగను, యుండుటకు విధాన ఆశయముల విషయమున ప్రజలలో అధిక సంఖ్యాకులయొక్క ఆమోదముమీద ఆధారపడునట్లు చేయబడ వలసియున్నది. ఈ ప్రణాళిక ఆ సూత్రము ననుసరించియే యున్నది.

యెట్లనగా, దేశములోని నానా తరగతులవారిచే ఆమోదించబడిన రాజ్యాంగమునుండియే యీ ప్రణాళిక తన ఆశయములను పొందు చున్నది. ఈ ప్రణాళిక యావద్దేశములో చర్చించబడెను, చేయబడిన విమర్శనలను, సూచనలను, ప్లానింగ్ కమిషన్ లెక్కకుగొనెను. సంఘమునందలి యే ఒక్క భాగము వారి నిమిత్తముగ మాత్రముగాక యావత్సంఘము కొరకై యీ ప్రణాళిక రూపొందించబడెను. ఇందు వల్ల యీ ప్రణాళికకు జాతీయత సులక్షణము కలుగుచున్నది. కేంద్ర ప్రభుత్వము, స్టేట్ల గవర్నమెంట్ల మధ్యను, ప్రభుత్వభాగము, వ్యక్తుల భాగముల మధ్యను, కుదిరిన సమాధానముమీద యీ ప్రణాళిక ఆధార పడియున్నది. ఈ దేశమునందు రాజకీయ, ఆర్థిక ప్రజా పరిపాలనను బలపరచుటకే యీ ప్రణాళిక ముఖ్యముగా నుద్దేశించబడి యున్నది.

ప్ర. ఈ ప్రణాళిక "మితమైన" ఆశయములను గలిగి యున్నదని వర్ణించబడెను. అది వాస్తవమైనయెడల, ఇంకను హెచ్చు అభ్యుదయకరమైన కార్యక్రమము యేల తయారు చేయబడలేదు ?

ఉ. ఎక్కువ అభ్యుదయకరమైన కార్యక్రమమునకు అవసరమై యుండు ఆర్థిక, సాధన సంపదలను పొందుటకు ఆశలు లేనందుచేతనే మితమైన ఆశయములనుగల ప్రణాళిక సిద్ధపరచబడెను. ఈ ప్రణాళిక "మితమైనది"గ నున్నను వాస్తవిక స్థితులను గుర్తించియున్నది. లభ్య పడెడు సాధన సంపదలను—ఆర్థిక, స్థూల సంపదలను—దృష్టియం దుంచు కొని లక్ష్యములు జాగ్రత్తతో రూపొందించబడెను.

ప్ర. ఈ ప్రణాళిక ఆచరణ యోగ్యమైయుండుటచేతను, లక్ష్యములు అసాధ్యములైనవి గాకుండుటచేతను, ఈ ప్రణాళిక జయప్రదమగుటకు ముఖ్యమైనవి యేవి ?

ఉ. (1) ప్రపంచ యుద్ధముగాని, అంతః కలహములుగాని లేకుండుట ;

(2) కేంద్ర, స్టేట్ల ప్రభుత్వముల మధ్య సన్నిహిత సహకారము వుండుట ;

(3) ప్రజల సహకారము ;

(4) సత్యనిరతిగల సమర్థవంతమైన పరిపాలన.

ప్ర. ఇది ఒక ఆఖరు ప్రణాళికయా, లేక ప్లానుచేయు కార్యము యెడతెగనిదియా ?

ఉ. ప్లానుచేయు కార్యము యెడతెగక జరుగుచుండుటకు వుద్దేశించబడియున్నది. ప్రస్తుతపు ప్రణాళిక భవిష్యత్తుకు సంసిద్ధత చేయునదిగనున్నది. ఈ ప్రణాళిక పిదప మరికొన్ని రాగలవు.

ప్ర. కొన్ని సమయములలో మాత్రమేగాని, లేక యెల్లప్పుడును గాని, పనులు లేనివారు ఇండియాలో చాలామంది గలరు.

(I) గ్రామ సీమలలోను, (II) పట్టణ ప్రాంతములలోను, నిరుద్యోగమును నశింపజేయుటకై యేమిచేయ తలపెట్టబడి యున్నది ?

ఉ. భారీ ఇర్రిగేషన్ వర్క్సు, చులకన ఇర్రిగేషన్ వర్క్సు, అతి బాహుళ్యపద్ధతిన బంజరు భూములను పంట పొలములనుగా చేయుట, విద్యుచ్ఛక్తి స్థాపనలు, రోడ్లను నిర్మించుట, గ్రామ పరిశ్రమలను పునస్థాపితమొనర్చుట, గృహపరిశ్రమలను పెంపొందించుట, యీ స్కీములెల్ల, గ్రామసీమలలో నిరుద్యోగమును నిర్మూలించుటకై, ప్రణాళికయందు చేర్చబడియున్నవి, ప్రణాళిక కాలమునందు గృహ పరిశ్రమలు,

చిలకన పరిశ్రమలు, చేతిపనులకొరకై రూ. 15 కోట్లు ప్రత్యేకించబడి యుండుటచేతను, భారీ పరిశ్రమలపై పన్నులను విధింప నుద్దేశించబడి యుండుటచేతను, చిలకన పరిశ్రమలు, గృహ పరిశ్రమలు, పోటీస్థితిలో బలపడగలవు. మేలైన పద్ధతులను, మేలైన నిర్మాణమునుగలిగి, యీ పరిశ్రమలు అనేక మందికి పనుల నివ్వగలుగును.

ఉన్న భారీ పరిశ్రమలను విస్తృతపరచుటకును, క్రొత్తవానిని స్థాపించుటకును, ఉద్దేశింపబడియున్నది. అది జరిగినతర్వాత పట్టణ ప్రాంత నిరుద్యోగము నశించగలదు. యెగువ తెలుపబడిన చిలకన పరిశ్రమల అభివృద్ధిగూడా పట్టణప్రాంత నిరుద్యోగమును తొలగించుటకు తోడ్పడగలదు,

ప్ర. మధ్య తరగతివారి నిరుద్యోగ నిర్మూలన విషయములో యేమి చేయబడుచున్నది ?

ఉ. వ్యవసాయ ఫలోత్పత్తిని హెచ్చించి, భవిష్యత్కాల పారిశ్రామికాభ్యున్నతికి మూలాధారమును నిర్మించుటకే ప్రథమ పంచ వర్ష ప్రణాళిక ఉద్దేశించుచున్నందున, విద్యావంతులైన నిరుద్యోగులకు ఉద్యోగముల అవకాశములు తక్షణము యెక్కువ కాజాలవు. ప్రస్తుతపు ప్రణాళిక ఉద్దేశించుచున్న విస్తృతి నొందుచుండు ఆర్థిక వ్యవస్థలో, కొన్ని ఉపసేవలందు కొంత అదనపు ఉద్యోగములు లభ్యపడగలవు. కాని, పరిశ్రమలు అతివేగముగ పెంపొందినపుడే విద్యావంతులైనవారికి ఉద్యోగములు చిక్కుటకు గొప్ప అవకాశము లుండగలవు. ఈ విషయము కొంతవరకు, విద్యాపద్ధతులందు సంస్కరణ జేయుటతోను, శరీరశ్రమతో కూడిన పనుల విషయమున యువకులు గలిగియున్న మనోవైఖరి మార్పుతోను, సంబంధించి యున్నది.

# ద్రవ్యము

ప్ర. ఈ ప్రణాళికకు రూ. 2,069 కోట్లు వ్యయమగును. ఇది చాలా గొప్ప మొత్తము. దానిని సమకూర్చు టెట్లు? అది, అభివృద్ధి ప్రధాన కార్యములకు యెట్లు పంచబడును?

ఉ. ప్రభుత్వ భాగములో పెట్టుబడి చేయబడెడు రూ. 2,069 కోట్లు. మొత్తముమీద దిగువరీతిగా సమకూర్చబడుటకు ఉద్దేశించబడి యున్నది :

| | కోట్ల రూపాయలు. |
|---|---|
| (i) అభివృద్ధికరముకాని వ్యయమును భరించిన పిదప, కేంద్ర, స్టేట్ల, ప్రభుత్వముల (రైల్వేలతో సహా) రెవిన్యూలలో నుండి మిగిలి యుండునది ... ... ... | 738 |
| (ii) కేంద్ర, స్టేట్ ప్రభుత్వములచే పొందబడెడు దేశీయ ఋణములు, స్వల్పపాటి సేవింగ్స్, వగైరాలు ... ... ... | 520 |
| (iii) స్టర్లింగ్ నిలువలలోనుండి విడుదల జేయబడు మొత్తములనుబట్టి లోటు ద్రవ్య పద్ధతి (డెఫిసిట్ ఫైనాన్సింగ్) ద్వారా ... ... | 290 |
| (iv) ఇప్పటివరకు పొందబడిన విదేశ సహాయం ... | 156 |
| (v) మరికొంత విదేశ సహాయం, లేక అది లభ్యపడని యెడల పన్నులను అదనముగ విధించియు, దేశీయ ఋణములను పుచ్చుకొనియు, లోటు ద్రవ్య పద్ధతిని యెక్కువగ ఉపయోగించియు ... | 365 |
| మొత్తము ... | 2,069 |

ఈ మొత్తము, అభివృద్ధి ప్రథాన కార్యములకు దిగువ విధముగా పంచబడును :

| | కోట్ల రూపాయలు. |
|---|---|
| 1. వ్యవసాయము, సంఘాభ్యున్నతి ... ... | 361 |
| 2. ఇర్రిగేషన్ ... ... ... | 168 |
| 3. పలు ప్రయోజనార్థపు ప్రాజెక్టులు, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు ... ... ... | 266 |
| 4. విద్యుచ్ఛక్తి .. ... ... | 127 |
| 5 రవాణా, రాకపోకల సౌకర్యములు ... ... | 497 |
| 6. పరిశ్రమలు .. ... ... ... | 173 |
| 7. సంఘసేవలు ... ... ... | 340 |
| 8. పునరుద్ధరణ .. ... ... | 85 |
| 9. ఇతరములు ... ... ... | 52 |
| మొత్తము .. | 2,069 |

ప్ర. లోటు ద్రవ్యపద్ధతి (డెఫిసిట్ ఫైనాన్సింగ్) అనగా నేమి ? కరెన్సీ నోట్లను యెక్కువగా ముద్రించుటయే దాని అర్థమైన పక్షమున, తన్మూలమున ఇన్ఫ్లేషన్ సంభవింపదా ? ఇన్ఫ్లేషన్ దేశమునకు హానికరము కాదా ?

ఉ. ప్రజల వద్దనుండి స్వీకరించు మొత్తమునకు మించి ప్రభుత్వముచే చేయబడు వ్యయము "లోటు ద్రవ్య పద్ధతి" అని పేర్కొనబడుచున్నది. చేర్చి పెట్టబడియుండు తన రొక్కపు మిగుల్లను ఉపయోగించిగాని, లేక రిజర్వు బ్యాంకివద్దనుండి ఋణమును పుచ్చుకొనిగాని, అట్టి లోట్లను ప్రభుత్వము సరిపుచ్చగలిగి యున్నది.

ఈ పద్ధతినిబట్టి రొక్కము "సృష్టించ" బడవలసి యుండును. రొక్కమును సృష్టించుటంతయు ఇన్‌ఫ్లేషన్‌ను కలుగజేయదు. ఉదాహరణమునకు, ఆర్థిక క్రియాకలాపములు ఉన్నత పట్టములో జరుగుటకు యెక్కువ రొక్కము లవసరమైయుండును. ఈ సందర్భమున, పద్ధతి ముఖ్యము కాదు ; ఫలితమే ముఖ్యము.

ఏక కాలమునందే దేశీయ ఉత్పత్తి హెచ్చక చలామణిలోనుండు రొక్కపు మొత్తము హెచ్చుటవల్ల ఇన్‌ఫ్లేషన్ సంభవించుననుట నిజమే. కాని, దేశీయ ఉత్పత్తికి తోడుగా విదేశములనుండి సరకులు వచ్చుచున్నయెడల, తత్సమానమైనవి వెలుపలికి పోకుండునెడల, లోటు ద్రవ్య పద్ధతియొక్క ఇన్‌ఫ్లేషనరీ ప్రతిఫలములు పనిజేయజాలకుండును. కావున, ఈ ప్రణాళిక లోటు ద్రవ్య పద్ధతిని పరిమితి పరచెను. ప్రణాళిక కాలములో స్టర్లింగ్ నిలువలలోనుండి విడుదల చేయబడగల రూ. 290 కోట్లకు మాత్రమే లోటు ద్రవ్య పద్ధతి పరిమితి పరచబడెను. ఈ స్టర్లింగ్ నిలువలు ఈ దేశ ప్రజలచే ఇదివరలో చేర్చి పెట్టబడెను. యుద్ధకాలములో యీ దేశము చేసిన వస్తువుల, సేవల, సరఫరాలకై చెల్లింపబడవలసి యుండి, అప్పుడు చెల్లింపబడక పేరుకొనియుండిన మొత్తములే "స్టర్లింగ్ బాలెన్సస్" అని పేర్కొనబడుచున్నది. ఇపుడు అవి విడుదల జేయబడుటయును సరకులును, సేవలును యీ దేశమునకు వచ్చును ; యీ దేశమునుండి తత్సమానమైనవి పోవు. కనుక, విడుదల జేయబడెడి మొత్తమునకు లోటు ద్రవ్యమును పరిమితి పరచినయెడల ప్రజలలో కొనుగోలు శక్తి, సరకులకు మించి, అధికముగ నుండదు. అయినను, అభివృద్ధి కార్యక్రమము ఇన్‌ఫ్లేషనరీ ఒత్తిళ్లను కలుగజేయుట సహజము. దీనిని యెదుర్కొనుటకై కంట్రోళ్ల విధానమును కఠినముగా పాటించుట

అవసరమైయున్నది. ఆఖరున ఒక సంగతిని నొక్కి చెప్పదగును: లోటు ద్రవ్య పద్ధతి ఒక ఉపాయము, అది నేర్పుతోను, వివేకముతోను, ఉపయోగింపబడవలెను. అట్లు చేసినయెడల లోటు ద్రవ్య పద్ధతి అభ్యున్నతికి ప్రయోజన వంతముగా తోడ్పడగలదు.

ప్ర. నిలుకడగల ధరలతో అభివృద్ధి నొందకుండుట కంటే లోటు ద్రవ్య పద్ధతితో ఆర్థికాభ్యున్నతిని కోరట సరియేనా ?

ఉ. నిలుకడగల ధరలతో అభివృద్ధి నొందకుండుటకు గాని, లోటు ద్రవ్య పద్ధతితో ఆర్థికాభివృద్ధి పొందుటకుగాని, యీ రెంటిలో నొకదానిని యేరి కోరుకొనవలసిన యెడల, లోటు ద్రవ్య పద్ధతిలోగల ప్రమాదమునకు కొంత లోనై మనము అభ్యున్నతినే యేరి కోరుకొనవలెను.

ప్ర. స్వల్ప మొత్తములను మిగుల్చు "సామాన్య మానవుడు", లోటు ద్రవ్య విస్తృతిని మట్టగించుటలో యెట్లు తోడ్పడగలడు ?

ఉ. తాను మిగిల్చిన సొమ్మును ప్రభుత్వమునకు ఋణముగానిచ్చి అతడు తోడ్పడగలడు. పన్నుల రూపమునగాని, లేక ఋణముల రూపమునగాని, ప్రజలవద్దనుండి ప్రభుత్వము యెంత యెక్కువగ పొందగలదో, లోటు ద్రవ్యపద్ధతిని వుపయోగించుటకు అంతతక్కువ అవసరముండును.

ప్ర. విదేశ సహాయమును అంగీకరించుటవల్ల రాజకీయముగా బానిసలగుదుమా ?

ఉ. రాజకీయమైన నిర్బంధములేవియు దానికి అంటకట్టబడకుండిన యెడల విదేశ సహాయము ఒక దేశమును రాజకీయముగా బానిసనుచేయ జాలదు. వాస్తవస్థితిలో ప్రపంచమందలి అభ్యున్నతిజెందిన ప్రతిదేశము దాని ఆర్థికాభివృద్ధియందు యేదోయొక ఘట్టమునందు విదేశ సహాయ మును పొందెను. విదేశ సహాయము చెడ్డదని తలువరాదు. పెచ్చింప నుద్దేశించిన మొత్తపు సొమ్ములో విదేశ సహాయముయొక్క మొత్తము స్వల్పమైయున్నది.

ప్ర. మరికొంత విదేశ సహాయము లభ్యపడనియెడల, పెట్టు బడి యోగమును తగ్గించి, పన్నులరూపములో ప్రజలు మరి కొంత యెక్కువ భారమును భరింపవలసియుందురా ?

ఉ. ఔను. మనము ఉద్దేశించిన రీతిగా మరికొంత విదేశ సహా యమును ప్రణాళిక కాలములో పొందజాలకపోతిమేని, స్వదేశమునందు పన్నులద్వారాను, ఋణములద్వారాను మరికొంత ధనమును సమకూర్చు చేయుటగాని, లోటు ద్రవ్యపద్ధతిని ఉపయోగించుటగాని, అవశ్యమై యుండును. వీనిమూలమున దేశములోని వస్తువినియోగ ప్రమాణములపై ప్రతిఫలములు కనబడగలవు. భవిష్యత్కాలపు అభివృద్ధికి ఘన పునా దులను వేయగోరుదుమేని ప్రణాళికయొక్క ఆకృతిని తగ్గించుటకు అనుమతింపజాలము, కాని, నేటి త్యాగములు రానున్న సంవత్సర ములలో ఫలింపగలవు.

ప్ర. ఈ ప్రణాళికయొక్క ఫలితముగా ఇండియాయొక్క జాతీయ ఆదాయము యెంతవరకు హెచ్చగలదు ?

ఉ. ఈ ప్రణాళిక ముందు వానికి దారిదీయునదిగానున్నది. భవిష్య త్కాలాభివృద్ధికి ఇది పునాదులను వేయుచున్నది. అందుచేత, యీ

ప్రణాళికకాలములో చేయబడు ప్రయత్నములన్నిటికి వెన్వెంటనే ఫలములు లభింపవు ; కాని రానున్న సంవత్సరములలో ఆ ఫలములు సంఘమునకు లభ్యపడగలవు. అయినప్పటికిని, యీ ప్రణాళిక కాలమునందుగూడా జాతీయ ఆదాయము గమనార్హముగ పెరుగగలదని యెంచబడుచున్నది. ధరలు నిలుకడగలిగియున్నయెడల, ఐయిదేండ్లకాలము వెనుక జాతీయ ఆదాయము రూ 9,000 ల కోట్లనుండి రూ 10,000 ల కోట్లకు, అనగా నూటికి 11 మొదలు 12 పంతులవరకు, పెరుగగలదని అంచన వేయబడెను. ఈ పెరుగుదల స్వల్పమైనదిగా తోచవచ్చును, కాని ప్రస్తుతపు దశలో అంతకుమించిన పెరుగుదల జరుగవచ్చునని ఆశలను జూపుట వాస్తవికతకు విరుద్ధమైయుండును.

# ఆహారము, వ్యవసాయము

ప్ర. ఇండియాలో యే ప్రణాళిక చేపట్టబడినను అది మొట్ట మొదట వ్యవసాయముతో ప్రారంభముకావలసియున్న దనియు, మన ఆహార సరఫరాను అధికపరచవలసిన అవశ్యకత యుండుటచేత వ్యవసాయమునకే ప్రాముఖ్యత యొసగబడవలసియున్నదనియు, తెలుపబడెను. ఈ ప్రణాళిక ఆ మాటను యధార్థపరచుచున్నదా ?

ఉ. ఈ ప్రణాళికలో వ్యవసాయమునకే యెక్కువ ప్రాముఖ్యత యొసగబడియున్నది. వెచ్చింప నుద్దేశించబడియున్న మూలధనము రూ 2,069 కోట్లలో వ్యవసాయమునకు రూ. 361 కోట్లును, నీటి పారుదల సౌకర్యములకు రూ. 168 కోట్లును, పలుప్రయోజనార్థపు ఇర్రిగేషన్, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులకు రూ. 266 కోట్లును, ప్రత్యేకించ బడియున్నది. ఆఖరు సంఖ్యలో సగభాగము ఇర్రిగేషన్ నిమిత్తముగ వెచ్చించబడునని అనుకొందుమేని అప్పుడు ప్రత్యక్షముగా వ్యవసాయ మునకును, నీటిపారుదల సౌకర్యములకొరకును వెచ్చింపబడు డబ్బు మొత్తము రూ. 662 కోట్లు అగును : అనగా, వెచ్చింపనుద్దేశింపబడి యున్న మొత్తపు మూలధనములో నూటికి 32 వంతున వ్యవసాయ మునకే వుపయోగించబడుచున్నది.

ప్ర. ఆహారధాన్యముల వుత్పత్తి దేశావసరములకు యెంత తక్కువపడుచున్నది ? యే యేట మనము యెంత దిగుమతి చేయవలసియున్నది ?

ఉ. సుమారు ముప్పదిలక్షల టన్నులు తక్కువపడుచున్నది. సరాసరి యింత పరిమాణమునే గడచిన కొన్నేండ్లుగా మనము ప్రతి సంవత్సరము దిగుమతి చేసుకొనవలసియుండెను. దిగుమతి చేయబడిన ఆహారధాన్యముల సరాసరి వార్షిక విలువ రూ. 150 కోట్లుగానున్నది.

ప్ర. ఈ ప్రణాళిక పూర్తిగా ఆచరణకు బెట్టబడినపుడు ఇండియా ఆహార విషయములో స్వయంసమృద్ధిని గలిగియుండునా? ఉండనియెడల, లక్ష్యమునకు ఇండియా ఎంత దాపునకు చేరియుండును?

ఉ. జనాభా పెరుగుదలను లెక్కకుగొని, ప్రస్తుతపు మట్టములలో వినియోగము జరుగుచుండునట్లు భావింతుమేని, వుత్పత్తి నిలుకడతో నుండిన యెడల, యేర్పడగల కొరత 67 లక్షల టన్నులకు పెరుగును. కాని, ఆహారధాన్యముల వుత్పత్తిని 76 లక్షల టన్నులు అధికముగా చేయుటకు ఈ ప్రణాళిక సంకల్పించుచున్నది. ఈ లక్ష్యము సాధించబడిన యెడల, వినియోగము యిప్పటి మట్టములలోనే యుండువక్షమున దేశము స్వయంసమృద్ధిని కలిగియుండును.

ప్ర. ప్రణాళిక జరుగుకొలది ఆహారధాన్యములు చౌకకాగలవని యెన్నబడుచున్నదా?

ఉ. తలచిన రీతిగా వుత్పత్తి హెచ్చినయెడల, ప్రణాళికకాలము ముగింపునకు వచ్చుసమయమున ఆహారధాన్యముల ధరలు కొంచెము తగ్గవచ్చును. కాని, ధరలు యెక్కువగ తగ్గునని తలచబడకున్నది.

ప్ర. ప్రజల ఆహార అలవాట్లలో నొకమార్పు ఆహారపరిస్థితిని యేవిధముగ బాగుపరచగలదు?

ఉ. ప్రపంచమునందు బియ్యము కొరతపడియుండుటవల్లను, దానిని దిగుమతిచేసుకొనుటకు విపరీతమైన వ్యయమును చేయవలసియుండుటవల్లను, బియ్యమునకు బదులుగా కొంత గోధుమలను వుపయోగించినయెడల ఆహారసమస్య కొంత తొలగగలదు. ఉపాహారములను, మత్స్యములను, విశేషముగ వాడినయెడల బియ్యమునకు ఒత్తిడికూడా తగ్గును.

ప్ర. హెచ్చు వ్యవసాయ ఫలోత్పత్తి ఏ విధముగ సాధించబడును?

ఉ. ముఖ్యముగా, భారీ ఇర్రిగేషన్ వర్కుస్, చులకన ఇర్రిగేషన్ వర్కుస్‌లకు ఫలితముగా హెచ్చు నీటిపారుదల సౌకర్యములవల్లను, బంజరు భూములను పంటభూములుగ జేయుటవల్లను, ఎరువులను, ఫర్టిలైజర్లను (కృత్రిమ యెరువులు), శ్రేష్ఠమైన విత్తనములను, వుపయోగించుటవల్లను, హెచ్చు వ్యవసాయ ఫలోత్పత్తి పొందబడును.

ప్ర. భారతదేశ పరిస్థితులకు అనుకూలించని యంత్రోక్తమైన వ్యవసాయ పద్ధతులను వివేచనములేకయే మనము అనుసరించుచున్నామా?

ఉ. లేదు. యంత్రోక్తమైన వ్యవసాయ పద్ధతులు వాస్తవముగా అనుకూలతలనుగలిగియున్నవి. ఇవి కొన్నిపనులకు మాత్రము ఉపయోగించబడుచున్నవి. వుదాహరణమునకు, బీడుభూములను, పనికిరాని మొక్కలతోనిండిన భూములను, వ్యవసాయ యోగ్యముగ చేయుటకును, జనసంఖ్య తక్కువగనుండు ప్రాంతములలో పనివారి కొరతగలచోట్లయందు వ్యవసాయమును సాగించుటకును, యంత్రోక్తమైన పద్ధతులు వాడబడుచున్నవి. కాని, ఇతరచోట్లలో ఈ పద్ధతులు విశేషించి

వుపయోగించబడుట లేదు. యేలననగా, భూముల సంస్కరణములకు ఫలితముగా గొప్ప భూ ఖండములు చిన్నవిగా విభజింపబడుటచేత ఆ పద్ధతులకు స్థితులు అనుకూలముగ లేకున్నవి; సహకార వ్యవసాయము అభివృద్ధిజెందిన, తన్మూలమున చిన్న భూఖండములు విశాలమగువరకు స్థితులు ఆ పద్ధతులకు అనుకూలింపజాలవు.

ప్ర. ద్రవ్యము, వుత్పత్తుల విక్రయము, మేలైన పద్ధతులను వాడుటలో తరిఫీదు, వగైరాల విషయమున రైతునకు యేవిధముగా సహాయము చేయబడును ?

ఉ. యేర్పరచబడిన ప్రాజెక్టు ప్రాంతములలో కమ్యూనిటి ప్రాజెక్టు ఆర్గానిజేషను (ప్రజాహితకరమైన కొన్ని స్కీములను కొనసాగించెడి సంస్థ), రైతునకు పలు విధములుగా తోడ్పడును. ఆ సంస్థకు తోడుగా ఒక "నేషనల్ ఎక్స్టెన్షను సర్వీస్" అనునది స్థాపించబడుటకు వుద్దేశించబడియున్నది. ఈ సేవ, పదేండ్ల కాలములోగా యావద్దేశమునకు వ్యాపించగలదు. ఈ విస్తృతి సేవకులు, రైతులకు మేలైన వ్యవసాయ పద్ధతులనుగూర్చి నేర్పుటయేగాక, సహకార సంస్థల అభివృద్ధియందును, మొత్తముమీద గ్రామ జీవితమును బాగుపరచుటయందును, తోడ్పడుదురు.

ద్రవ్య విషయములో, రిజర్వు బ్యాంకి సహకారోద్యమమునకు హెచ్చైది సహాయమునే చేయుచున్నది. ముఖ్యమైన బ్యాంకులకు రిజర్వు బ్యాంకి చేసిన సహాయము 1946–47 వ సం॥లో రూ. 1.5 లక్షలుగానుండి 1951–52 వ సం॥లో రూ. 12.5 కోట్లకు పెరిగెను. రిజర్వు బ్యాంకియొక్కయు, ప్రభుత్వముయొక్కయు, సహకార సంఘ

ములయొక్కయు, సహాయముతో, రైతుల కొసగబడెడు స్వల్పకాలపరిమితి గల ఋణములు, ప్రణాళిక ముగింపునకు వచ్చునప్పటికి సాలుకు రూ. 100 కోట్లుగా నుండగలదు.

దీర్ఘకాలము కానట్టి (మీడియం) ఋణముల విషయములో రూ. 5 కోట్లవరకు ఋణముల నిచ్చుటకు కూడా రిజర్వు బ్యాంకి అంగీకరించెను. పంచవర్ష ప్రణాళికలో నొక భాగముగ, అట్టి ఋణముల నిచ్చుటకై ప్రభుత్వము మరియొక రూ. 5 కోట్లను ప్రత్యేకించుచున్నది. అదే విధముగా, సహకారోద్యమముయొక్క దీర్ఘకాల ఆర్థిక సంపదను అదనము చేయుటకై ప్రభుత్వము రూ. 5 కోట్లను ప్రత్యేకించుచున్నది.

ఉత్పత్తుల విక్రయము (మార్కెటింగ్) విషయములో ప్లానింగ్ కమిషన్ యీ సూచనలను చేసెను: (i) వస్తువులను పదిలముగ నుంచుటకు సౌకర్యములను గలిగినట్టియు, వ్యవసాయ ఫలోత్పత్తులను ఒక పద్ధతివారీగా యేర్పరచి బాగుపరచగలిగినట్టియు, సహకార మార్కెటింగ్ సొసైటీలను పెంపొందించుట; (ii) సక్రమ పరచబడిన మార్కెట్లను స్థాపించుట, (iii) వ్యవసాయ ఫలోత్పత్తులను తరగతుల వారీగా విభజించుట.

ప్ర. అభివృద్ధి కార్యక్రమమునందు సహకారోద్యమము యెట్టి పాత్రను ధరించగలదు?

ఉ. సాంఘిక, ఆర్థిక శీఘ్రాభివృద్ధికి, ముఖ్యముగా పల్లె ప్రాంతములలో, సహకార సూత్రము మూలాధారమైనట్లు భావించబడెను. వ్యవసాయమునకు ద్రవ్యమును యొసగుటకును, వ్యవసాయ ఫలోత్పత్తులను విక్రయించుటకును, విత్తనములను, ఫర్టిలైజర్లను, రైతుల ఇతర

అవసరములకు కావలసిన వానిని, సరఫరా చేయుటకును, వ్యవసాయ కార్యముల నిర్వహణ పద్ధతిని సహకార గ్రామ నిర్వహణ మూలమున మార్పు జేయుటకును, సహకార సంస్థలు ధరించవలసిన పాత్ర ముఖ్యమై యున్నదని యీ ప్రణాళిక నొక్కి నుడువుచున్నది. సహకారమునందు తరిఫీదు నిచ్చుటకు యేర్పాటు చేయుటకును, సహకార వ్యవసాయములో పరిశోధనలను జరుపుటకును, రూ. 50 లక్షలు ప్రత్యేకించబడెను.

ప్ర. "కీలక గ్రామ" స్కీము అనగా నేమి ?

ఉ. "కీలక గ్రామ" మను మాటలోనే దాని అర్థము యిమిడి యున్నది ; ఈ దేశములో పశువులను అభివృద్ధిపరచుటకు కీలక గ్రామములు మూలాధారములై యుండును. మూడేండ్ల వయస్సుమించిన దాదాపు 500 ఆవులను గలిగియుండు మూడు లేక నాలుగు ప్రక్క ప్రక్కననేయుండు గ్రామములు చేరి ఒక "కీలక గ్రామ" మగును. ఒక కీలక గ్రామములో పశుపెంపు, శ్రేష్ఠమైన జాతికిజెందిన కొన్ని ఆబోతెద్దులకు మాత్రమే పరిమిత పరచబడును. ఇతర యెద్దులన్నియు తొలగించబడును, లేక విత్తులు తీసివేయబడును. తత్ఫలితముగా, నాలుగైదు తరములలో ఆ గ్రామ పశువులన్నియు శ్రేష్ఠమైనవిగా నుండును. పోషించబడవలసియుండు ఆబోతెద్దుల సంఖ్యను మట్టస పరచుటకై కృత్రిమరీతిగ చూలు కలుగునట్లు చేయు వుపాయము ప్రవేశ పెట్టబడును. పశువుల వంశావళి, పాల వుత్పత్తి, చక్కని మేత వేయుటకై పుచ్చుకొనబడిన చర్యలు, వ్యాధుల నివారణకై చేయబడిన కట్టుదిట్టములు, వీనినిగూర్చి రికార్డులు వుంచబడును.

600 కీలక గ్రామములను, కృత్రిమరీతిగ చూలు కలుగునట్లు చేయు 150 కేంద్రములను, ఆబోతెద్దులను పెంచుటకు 225 దొడ్లను, స్థాపించుటకు పంచవర్ష ప్రణాళిక ఉద్దేశించియున్నది.

# భూముల విధానము

ప్ర. ప్రణాళికలో వివరించబడియున్న భూముల విధానము ఒక నూతన సాంఘిక యేర్పాటుకు దారి దీయునసుట సరియేనా ?

ఉ. సరియేను, ఒక వైపున, గొప్ప భూస్వాములు, మధ్యస్థులు, తొలగించబడి, యావద్దేశములో ఒకే విధమైన పద్ధతి యజమానులైన రైతులు తమ పొలములను తామే సేద్యమును చేసుకొను పద్ధతి యేర్పాటు చేయబడుటకు యీ విధానము తోడ్పడును. మరియొక వైపున, సహకార పద్ధతికి ప్రాముఖ్యతనిచ్చి, వ్యక్తిగతముగ గలిగి యుండు భూములను గ్రామ మట్టములో సహకార పద్ధతిలోని వ్యవసాయ మును నిర్వహింపజేసి, ఒక నూతన సాంఘిక యేర్పాటును యీ భూముల విధానము దారిదీయును. అట్టి యేర్పాటు జరుగుట దీర్ఘకాల విధానముపై ఆధారపడియున్నది. కాని, సహకార సేద్యములో కొన్నిపరిశోధనలను జరుపుటకు ప్రణాళికయందు యేర్పాటు చేయబడి యున్నది.

ప్ర. సహకార గ్రామ నిర్వహణయన నేమి ?

ఉ. సహకార గ్రామ నిర్వహణ యనగా, ఒక గ్రామముయొక్క భూముల నన్నిటిని, ఆ గ్రామములోని వారందరును గూడి నిర్వహించుట. ఇట్లు చేయుటలో, భూములనెల్ల యేకీకరణ చేయుటకు సమ్మతించిన వ్యక్తులయొక్క ఆస్తిపై హక్కు, వారి భాగపువంతు యివ్వబడుటద్వారా, గుర్తించబడును, ఇట్టి పద్ధతివల్ల, ఒక గ్రామముయొక్క భూముల నన్నిటిని యేక ఖండముగా గ్రామస్థులు నిర్వహించగలిగియుందురు.

ప్ర. జమీందారులకు నష్ట పరిహారము చెల్లించబడుచున్నదా? చెల్లించబడుచున్నయెడల, యే పద్ధతిమీద అట్లు చేయబడు చున్నది?

ఉ. చెల్లించబడుచున్నది. జమీందారులు, మల్గుజార్లు, జాగీర్దారులు నష్టపరిహారము చెల్లించబడుచున్నారు. ఆ చెల్లింపు మొత్తములు ఒక్కొక్క స్టేట్‌లో ఒక్కొక్కవిధముగ నున్నను, సాధారణముగా నష్టపరిహారము, ఒక జమీందారుడు అతని భూస్థితినుండి పొందుచుండిన ఆదాయముయొక్క గుణిజముగా నిర్ణయించబడియున్నది. అయినను, ఆ గుణిజము, అన్ని సందర్భములలోను యేకరీతిగా నుండుట లేదు. భూస్థితి యెంత స్వల్పమైనదిగ నుండునో అంత హెచ్చు గుణిజము పుపయోగించబడుచున్నది. ఉదాహరణమునకు, ఉత్తర ప్రదేశ్‌లో రూ 25 లు గాని లేక అంతకు తక్కువ మొత్తమునుగాని, భూమి శిస్తును చెల్లించు ఒక భూస్వామి (జమీందారుడు) పునరుద్ధరణ గ్రాంటుతో సహా, [illegible]రని ఆదాయమునకన్న 28 రెట్లు అధికమైన నష్ట పరిహార మును పొందుచున్నాడు. కాని, రూ 50,000 ల భూమి శిస్తును చెల్లించెడి ఒక జమీందారుడు నష్ట పరిహారముక్రింద 9 రెట్లను మాత్రమే పొందుచున్నాడు.

ప్ర. ఒక వ్యక్తి యెంత హెచ్చుగ భూములను కలిగియుండ దగునో ఆ హెచ్చు పరిమితిని నిర్ణయించు సూత్రమునకు ప్లానింగ్ కమిషన్ అనుకూలముగ నున్నది. ఆ హెచ్చు పరిమితిని నిర్ణయించుట యెట్లు?

ఉ. ప్లానింగ్ కమిషన్ కొన్ని సూత్రములను తెలిపినది. ఆ సూత్రముల ననుసరించి పరిమితిని నిర్ణయించవచ్చును. ఒక ప్రాంత

ములో అనుసరించబడు సూత్రము, ఆ ప్రాంతములోని భూముల అను భవము, రెవిన్యూ యేర్పాట్లు, వీనిపై ఆధారపడి యుండవలెనని ప్లానింగ్ కమిషన్ తన అభిప్రాయమును తెలిపెను. హెచ్చు పరిమితిని నిర్ణ యించుటలో ఒక "కుటుంబముయొక్క భూమి" ని గమనించుట అనుభవ సిద్ధమైన పద్ధతిగ నుండునని ప్లానింగ్ కమిషన్ సూచించెను. "కుటుంబముయొక్క భూమి" యనగా, సాధారణమైన ఒక కుటుం బము, వ్యవసాయ కార్యములను జరుపుటలో వాడుకగా పొందబడు సహాయముతో, స్వంత సేద్యమును జరుపుకొనగలిగిన విస్తీర్ణముగల భూమి అని నిర్వచింపబడెను. ఒక్కొక్క స్టేట్‌లోను కొంత మార్పు ఉండినను ఉండవచ్చును; కాని, ఒక సామాన్య కుటుంబముయొక్క అనుభవములోనుండు భూమికన్న మూడురెట్లు పరిమితిని గలిగియుండుట న్యాయమని ప్లానింగ్ కమిషన్ తలచుచున్నది.

ప్ర. భూమి విధానము రైతులకు న్యాయముగలుగునట్లు చేయ గలదా?

ఉ. చేయగలదు. భూమి స్వాధీనములో నుండునట్లు చేయుటకును, చెల్లించవలసిన మొత్తమును పరిమితిపరచుటకును, భూమి విధానము తోడ్పడుచున్నది. భూమియొక్క అనుభవము కనీసము 6 యేండ్ల వరకు ఉండవలెననియు, చెల్లించబడవలసిన సొమ్ము, ఫలోత్పత్తిలో నాలుగవ లేక అయిదవ భాగమునకు మించి ఉండరాదనియు, సూచించ బడెను. ఒక భూస్వామి, తన స్వంత సేద్యమునకు ఉంచుకొనుటకు అనుమతించబడు విస్తీర్ణమునకు మించియుండు భూములను, ఆ భూము లలో వ్యవసాయము చేయుచుండు రైతులే కొనుగోలు చేసుకొనుటకు

హక్కును గలిగియుండవలెనని కూడా సూచించబడెను. ఆ భూమికి చెల్లించబడవలసిన ఖరీదు, పండిన పంటలో అతడు చెల్లించెడు మొత్తముయొక్క గుణిజముగ నుండవలెననియు, ఆ భూమి ఖరీదును వాయిదాల ప్రకారము కొంతకాలములో చెల్లించుటకు సదుపాయమును కల్పించవలెననియు, కూడా సూచించబడెను.

# సంఘాభివృద్ధి

ప్ర. సంఘాభివృద్ధి యనగానేమి? కమ్యూనిటీ ప్రాజెక్టులననేమి?

ఉ. శాస్త్రోక్తమైన వ్యవసాయమును జరుపుట, ఆరోగ్య పరిశుభ్రతలను చక్కగ గలిగియుండుట, రాకపోకల మార్గములను పెంపొందించుట, గృహ పరిశ్రమలను అభివృద్ధిపరచుట, ఇట్టి వాని మూలమున వారి స్థితిగతులను వారే బాగుపరచుకొనునట్లు చేయుటకై ప్రజల సహకారమును పొంది, గ్రామముల సాంఘిక, ఆర్థిక జీవితమునందు క్రమేణ మార్పు దెచ్చుటకై చేయబడు ప్రయత్న ఫలితమే సంఘాభివృద్ధి. ఈ ప్రయత్నము, గ్రామ జీవితమునందలి ఒక్కొక్క భాగమునను సంబంధించిన పెక్కుమంది ఉద్యోగుల మూలమునగాక, గ్రామాభివృద్ధికి సంబంధించిన ప్రధాన శాఖలకన్నిటికిని జెందెడు ఒక యేజెంటుద్వారా జరుపబడును. ఈ యేజెంటు, "గ్రామ మట్టపు సేవకు" డని పేర్కొనబడుచున్నాడు. పదేండ్ల కాలములో యిట్టి సేవకులు యావద్దేశమున వ్యాపించియుండునట్లు చేయుటకు ఉద్దేశించబడియున్నది. వీరెల్ల, రైతుయొక్క కష్టములనెల్ల తొలగించి, గ్రామ జీవితమును, మొత్తముమీద అభివృద్ధి నొందించుటలో తోడ్పడగలరు.

ఇంతలోపల, గ్రామ పునర్నిర్మాణ సమస్యను పరిష్కరించుటకై యున్న యీ పద్ధతి, కమ్యూనిటి ప్రాజెక్టు ప్రాంతములలో ఆచరణకు పెట్టబడుచున్నది. ప్రస్తుతము దాదాపు 55 ప్రాజెక్టులు అట్టివిగలవు; జరుగుచున్న సంవత్సరమునందు ఇంకను 55 అభివృద్ధి మండలములు

చేర్చబడును. ఒక ప్రాజెక్టు ప్రాంతము మూడు అభివృద్ధి మండల ములుగా విభజింపబడియున్నవి. ఒక్కొక్క అభివృద్ధి మండలము నందు 60,000 మొదలు 70,000 మందివరకు జన సంఖ్యను గలిగి యుండు సుమారు 100 గ్రామములుండును. ఈ అభివృద్ధి మండల ములు, దాదాపు అయిదు గ్రామములు చేరిన సముదాయములుగా విభ జింపబడియున్నవి. గ్రామ మట్టపు సేవకుని క్రియాకలాపములు ఒక సముదాయమునకు చెందియుండును. యావద్దేశమునకును సాధ్యము కాజాలదు గనుక యెక్కువమంది ఉద్యోగులు, యెక్కువ ఆర్థిక సంప దలు, యీ కమ్యూనిటి ప్రాజెక్టు ప్రాంతములకు కేటాయింపు జేయబడు చున్నవి. కాని, ఈ ప్రాంతములలో జరిగెడి తీవ్రతరమైన అభివృద్ధి వలస పొందబడు అనుభవము ఉపయుక్తమగు గుణపాఠములను నేర్ప గలదనియు, వానిని తర్వాత అతిబాహుళ్య పద్ధతిపై ఉపయోగించుటకు వీలుగలుగుననియు, యెంచబడుచున్నది.

ప్ర. సంఘాభివృద్ధి కార్యక్రమము వాస్తవముగా యేమి?

ఉ. ప్రధానక్రియలు వ్యవసాయమునకు జెందినవి. కాని, రాక పోకల మార్గములు, విద్యాభ్యాసము, ఆరోగ్యము, గృహనిర్మాణము, గ్రామ పరిశ్రమలు, సహకార సంస్థలు, వీనినెల్ల అభివృద్ధిపరచుటకు గూడా ప్రాముఖ్యత యివ్వబడియున్నది. వ్యవసాయమునకు సంబం ధించిన కార్యక్రమములో, లభ్యపడిన సకల బంజరు నేలలను వ్యవ సాయ యోగ్యముగజేయుట, చులకన ఇర్రిగేషన్ పనులు, వ్యవసాయము చేయుటలో మేలైన పద్ధతులు ఉపయోగించబడునట్లు చేయుట, మేలైన విత్తనములు, కృత్రిమ యెరువులు, సహజమైన యెరువులు, వాడబడునట్లు చేయుట, మంచి జాతి పశువుల మూలమున పశుపులను పెంపొందించుట, ఇత్యాదులు చేరియున్నవి.

కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతములోని ప్రతి గ్రామము ఒక ముఖ్యమైన రోడ్డుతో కలిసియుండునట్లు చేయుట రోడ్డు నిర్మాణ కార్యక్రమమై యున్నది.

ప్రాథమిక, మాధ్యమిక విద్యాభ్యాసమునకు మంచి యేర్పాట్లుండును. కళాభిజ్ఞులకు (పనివారికి) మేలైన పద్ధతులను నేర్పుటకై సహాయములు యేర్పాటు చేయబడగలవు

ఆరోగ్య విషయములో, మంచినీటి సరఫరాను రక్షించుటకును, మానవ, జంతు మల మూత్రములను చక్కగా తొలగించుటకును, అంటు వ్యాధులను అదుపులోనుంచుటకును, గట్టి ప్రయత్నములు చేయబడును. మేలైన గృహనిర్మాణ పద్ధతులందు గ్రామస్థులకు శిక్షణ యివ్వబడును. జనస్తోమము యెక్కువగనుండు గ్రామములలో నూతన గృహములను నిర్మించుటకు ఇండ్ల జాగాలను పెంపొందించుట అవశ్యమై యుండును.

ప్రతి గ్రామమునందు, లేక ఒక గ్రామముల సముదాయమునందు పలు ప్రయోజనార్థపు ఒక్క సహకార సంఘమునైనను స్థాపించుట యీ కార్యక్రమముయొక్క ఆశయములలో నొకటియైయున్నది.

# ఇఱ్రిగేషన్

ప్ర. వ్యవసాయదారుడు అతని పొలములకు నీటిని గలిగియుండుట అవశ్యమైయున్నది. ఇర్రిగేషన్ విషయములో యీ ప్రణాళిక అతనికి చేయనున్న సహాయము యేమి?

ఉ. 1950 వ సంవత్సరమునందుకన్న 197 లక్షల యెకరముల అదనపు భూములకు నీటిపారుదల సౌకర్యములను కలిగించుటకు యీ ప్రణాళిక తలపెట్టియున్నది. తత్ఫలితముగా 44 లక్షల టన్నుల అదనపు ఆహార ధాన్యములు (లేక దానికి సరిసమానమైన ఇతర పంటలు) ఉత్పత్తి కాగలవు.

ప్ర. అప్పుడే నిర్మితములగుచున్న నదీలోయ ప్రాజెక్టులవల్ల, ప్రణాళిక కాలమునందును, అవి పూర్తియైన తర్వాతను, కలిగెడి లాభములేమి ?

ఉ. అప్పుడే నిర్మితములగుచున్న గొప్ప నదీలోయ ప్రాజెక్టులు, ప్రణాళిక కడపటి యేడువచ్చునరికి 85 లక్షల యెకరముల అదనపు భూములకు నీటిపారుదల సౌకర్యమును గలిగించును; 10.8 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని అదనముగా ఉత్పత్తి చేయును. ఈ ప్రాజెక్టులు పూర్తిగా నిర్మింపబడి, అభివృద్ధిపరచబడిన పిదప నీటిపారుదల సౌకర్యములను పొందెడి మొత్తపు అదనపు భూముల విస్తీర్ణము 169 లక్షల యెకరములై యుండును; అదనముగా ఉత్పత్తి చేయబడు విద్యుచ్ఛక్తి 14 లక్షల కిలోవాట్లుగనుండును.

ప్ర. అప్పుడే నిర్మితమగుచున్నట్టియు. పంచవర్ష ప్రణాళికలో చేర్చబడినట్టియు, ప్రధాన ఇర్రిగేషన్, పవర్ ప్రాజెక్టు లెవ్వి ?

ఉ. అవి దిగువ వివరింపబడుచున్నవి :

భక్ర-నంగల్ ప్రాజెక్టు (పంజాబ్, రాజస్థాన్, "పెప్సు").
దామోదర్ వాలీ ప్రాజెక్టు (పశ్చిమ బెంగాల్, బీహారు).
హీరాకుడ్ డాం ప్రాజెక్టు (ఒరిస్సా).
తుంగభద్ర ప్రాజెక్టు (మద్రాసు, హైదరాబాద్)
దిగువ భవాని ప్రాజెక్టు (మద్రాసు).
మయూరాక్షి (పశ్చిమ బెంగాల్).
దిగువ తపతీలోయ ప్రాజెక్టు (బొంబాయి).
మాచ్ కండ్ హైడ్రో యెలెక్ట్రిక్ ప్రాజెక్టు (ఒరిస్సా. మద్రాసు).
సర్దా పవర్ హౌస్ (ఉత్తర ప్రదేశ్).

ప్ర. ప్రణాళికయొక్క ఆఖరు రెండు యేండ్లలో చేర్చబడుటకు యేర్పరచబడిన అయిదు గొప్ప ప్రాజెక్టు లేవి -

ఉ. చంబల్ ప్రాజెక్టు (మొదటి దశ) (మధ్య భారత్, రాజస్థాన్).
కోశి ప్రాజెక్టు (మొదటి దశ) (బీహారు, నేపాళము).
కోయన ప్రాజెక్టు (మొదటి దశ) (బొంబాయి).
రిహాండు ప్రాజెక్టు (ఉత్తర ప్రదేశ్).
కృష్ణా ప్రాజెక్టు (మద్రాసు, హైదరాబాద్).

ప్ర. చులకన ఇర్రిగేషన్ పనులవల్ల అనుకూలము లేమి ?

ఉ. చులకన ఇర్రిగేషన్ పనులవల్ల 112 లక్షల యెకరముల అదనపు భూములకు నీటిపారుదల సౌకర్యము లేర్పడి, 24 లక్షల టన్నుల ఆహార ధాన్యములు ఉత్పత్తి కాగలదని యెంచబడుచున్నది.

ప్ర. ప్రణాళికలో చేర్చబడియున్న గొప్ప ఇర్రిగేషన్ ప్రాజెక్టులు, చులకన ఇర్రిగేషన్ ప్రాజెక్టులు, ఒండొంటికి పరిపూర్ణత నిచ్చునవియా, లేక ఒండొంటితో తలపడునవియా ?

ఉ. గొప్ప ఇర్రిగేషన్ స్కీములకును, చులకన ఇర్రిగేషన్ స్కీములకును మధ్య విరుద్ధమేమియు లేదు. ఒక్కొక్క ప్రాంతము దానికి తగిన రకపు స్కీమువల్ల లాభమును పొందవలసియున్నది. కాబట్టి, అవి ఒండొంటిని సంపూర్ణతను చేయునవిగానున్నవి.

ప్ర. ఈ ప్రాజెక్టులు జయప్రదమగుటకు ప్రజలు తోడ్పడగల మార్గము లేవి

ఉ. ప్రజలు, దిగువ తెలుపబడుచున్న విధములుగా తోడ్పడవచ్చును :

(i) గొప్ప ఇర్రిగేషన్ ప్రాజెక్టులకు వ్యయపరచుటకై ప్రోగు చేయబడు ఋణములకు ద్రవ్య సహాయముచేసియు ;

(ii) బాగుచేయబడుటకు రుసుమును చెల్లించియు, హెచ్చు నీటి తీరువలను చెల్లించియు ;

(iii) కాలువలను త్రవ్వుట, రోడ్లను నిర్మించుట, వగైరాలవంటి పనులకు పూనుకొనుటకై గ్రామ సహకార సంస్థలను స్థాపించుట మూలమునను ;

(iv) స్టేట్ ఇర్రిగేషన్ వర్క్సుచే యొసగబడెడు నీటిని పొదుపుగను, లాభకరముగను ఉపయోగించియు ;

(v) వ్యక్తిగతమైన నీటిపారుదల సౌకర్యములను చక్కని స్థితిలోనుంచి, రక్షించియు.

ప్ర. ఇండియాలోనున్న సుమారు 5,60,000 గ్రామములలో 3,000 గ్రామములకు మాత్రమే విద్యుచ్ఛక్తి సరఫరా యగుచున్నది. గ్రామ సీమలకు విద్యుచ్ఛక్తి లభ్యమగు నట్లు చేయుటకై ప్రణాళికలో యేమి తెలుపబడియున్నది?

ఉ. గ్రామములకు విద్యుచ్ఛక్తిని సరఫరాచేయు విషయమునకు యెక్కువ ప్రాముఖ్యత నివ్వవలెనని ప్రణాళికలో తెలుపబడియున్నది. యేలననగా, అట్లు చేయుటవల్లనే వ్యవసాయ పద్ధతులు బాగుగుటయేగాక, గృహ పరిశ్రమలు, చులకన పరిశ్రమలుకూడా పెంపొందగలవు. దానికి తోడుగా, పల్లె ప్రాంతముల జీవితము యెక్కువ ఆకర్షణీయమైయుండును. గ్రామస్థులు విద్యుచ్ఛక్తిని, తత్సంబంధమైన సాధనములను పొందుటకై రైతులకును, గ్రామ సహకార సంఘములకును, ప్రభుత్వము ఋణముల నివ్వవలెననికూడా సూచించబడెను.

# పరిశ్రమలు

ప్ర. పరిశ్రమలమీదకన్న వ్యవసాయముమీద అంత యెక్కువ వ్యయమేల చేయబడుచున్నది ? ప్రాధాన్యతల క్రమము నందు పరిశ్రమలకు ఉచితస్థానము యొసగబడెనా ?

ఉ. రక్షణ పరిశ్రమల నిమిత్తముగా వినియోగించబడుచున్న అపారమైన సాధన సంపదలను లెక్కకుగొనక, ప్రణాళిక కాలములో పరిశ్రమలకు ప్రభుత్వము ప్రత్యక్షముగ చేయు పెట్టుబడి రూ. 94 కోట్లు మాత్రముగ నున్నది. కాని, యీ మొత్తముతోకూడా, చులకన పరిశ్రమలకును, ఖనిజసంపద అభివృద్ధికిని ప్రత్యేకించబడిన మొత్తములను, మూలాధారమైన పరిశ్రమలకును, రవాణాలకును ప్రత్యేకించబడిన అదనపు రూ. 50 కోట్లను చేర్చినయెడల మొత్తము రూ. 150 కోట్లు అగుచున్నది. మూలధనముగా ప్రభుత్వము వెచ్చింప తలపెట్టియున్న రూ. 2,069 కోట్లతో పోల్చి చూచిన పక్షమున, ఆ మొత్తము స్వల్పముగా తోచగలదు. కాని, పరిశ్రమల రంగములో చాలాభాగము వ్యక్తుల ప్రయత్నములకు వదలివేయబడియున్నదని జ్ఞప్తియుంచుకొనదగును. కాబట్టి, పారిశ్రామికాభివృద్ధి, చాలావరకు ప్రభుత్వ వ్యయము క్రింద చేరకుండును. వ్యవసాయమునందును, పరిశ్రమలయందును, ఏకకాలముననే భారీయెత్తున పెట్టుబడులను చేయుటకు ప్రభుత్వమువద్ద సాధనసంపదలు లేవు. కనుక, వ్యవసాయమునకే ప్రాముఖ్యత నివ్వబడవలసియున్నది. ఏలననగా, ఆర్థిక వ్యవస్థలో ఇతర రంగములందు అభివృద్ధినొందుటకు ప్రజలకు కావలసినంత ఆహారమును, పరిశ్రమలకు ప్రత్తి, జనుము వంటి ముడిపదార్థములును, ముఖ్యమైయున్నవి. అంతే

గాక, వ్యవసాయ ఫలోత్పత్తిని హెచ్చించుటకు కావలసిన ప్రధాన సాధనసంపద రైతులలో అధిక సంఖ్యాకులవద్ద లేకున్నది. కాబట్టి వ్యవసాయమునకు ప్రభుత్వముయొక్క సహాయము అతి బాహుళ్యముగా అవశ్యమైయున్నది. పారిశ్రామికుల విషయము అట్లుకాదు; పరిశ్రముల యజమానులు వారి స్వంతమైన సాధనసంపదలతో గొప్ప అభివృద్ధిని పొందగలరు. వ్యక్తుల భాగములో పరిశ్రమల అభివృద్ధికి వచ్చిన సాధనసంపద సుమారు రూ. 613 కోట్లుగా నుండునని ఆశింపబడు చున్నది. ఈ మొత్తమును, ప్రభుత్వము ప్రత్యక్షముగను, పరోక్షము గను పెట్టుబడిచేయనున్న రూ. 150 కోట్లతో చేర్చినపక్షమున, పరిశ్రమల అభివృద్ధికై పెట్టుబడిచేయనున్న మొత్తము రూ. 763 కోట్లు అగుచున్నది. ఇది స్వల్పమైన మొత్తముకాదు. ప్రణాళిక కాలములో అభ్యున్నతికొరకై లభ్యపడగలదని ఆశించబడుచున్న మొత్తపు సాధన సంపదయందు ఇది దాదాపు నూటికి 25 వంతులుగానున్నది.

దీనికితోడుగా మరియొక సంగతినిగూర్చి తెలుపవచ్చును. విద్యు చ్ఛక్తిని అభివృద్ధిపరచుటకై చేయబడు గొప్ప వ్యయములో కనీసము కొంతభాగమైనను, పారిశ్రామికాభివృద్ధికేనని గుర్తింపదగును.

ప్ర. పారిశ్రామికాభివృద్ధికి ప్రత్యేకించబడిన మొత్తమెంత? ఈ మొత్తము, ప్రభుత్వభాగమునకును, వ్యక్తుల భాగము నకును, యెట్లు విభజింపబడెను -

ఉ. ప్రణాళిక కాలములో అతిబాహుళ్య పారిశ్రామికాభివృద్ధికొరకై పెట్టుబడిచేయ నుద్దేశించబడిన మొత్తము (రక్షణ పరిశ్రమలలో చేయ బడు పెట్టుబడులు, ప్రధాన పరిశ్రమలు, తత్సంబంధమైన రవాణా నిమిత్తముగా ప్రత్యేకించబడిన రూ. 50 కోట్లలోనుండి పరిశ్రమలకు

కేటాయించబడగల మొత్తము, మినహాయించబడి) రూ. 707 కోట్లు అగుచున్నది. ఈ మొత్తమునందు, ప్రభుత్వభాగములో ప్రాజెక్టుల నిమిత్తముగా ప్రభుత్వము పెట్టుబడిచేయనున్న రూ. 94 కోట్లు చేరి యున్నది. మిగిలిన మొత్తము, పారిశ్రామికాభివృద్ధికొరకై వ్యక్తులు ఉంచగల మూలధనముగ నున్నది.

ప్ర. పారిశ్రామికోత్పత్తియొక్కయు, అదనపు శక్తియొక్కయు లక్ష్యము లేవి

ఉ. ప్రధాన పరిశ్రమలలోను, సరకులను ఉత్పత్తిచేయు పరిశ్రమల లోను మాత్రమే అదనపుశక్తిని కలిగించుటకు యీ ప్రణాళిక యత్నించు చున్నది. వినియోగార్థపు సరకులను తయారుచేయు పరిశ్రమల విషయములో, యిప్పుడున్న శక్తిని పూర్తిగా వినియోగించుకొనినయెడల ప్రస్తుతపు మట్టములలో వినియోగమునకు అవసరములు దీరుటయేగాక యెగుమతి చేయబడుటకు మిగుళ్లుగూడా నుండును. కావున, వినియోగార్థపు సరకులను ఉత్పత్తిచేయు పరిశ్రమల శక్తిని విస్తృతినొందించుట అప్రధానముగ నున్నది.

కొన్ని గొప్ప పరిశ్రమల విషయములో అదనపు శక్తి, ఉత్పత్తుల లక్ష్యములు దిగువ వివరించబడుచున్నవి :

| | యూనిట్. | 1955-56 కు అదనపు శక్తి. | 1955-56 కు అదనపు ఉత్పత్తి. |
|---|---|---|---|
| 1. ఇనుము, ఉక్కు.- | | | |
| (ఎ) దుక్క ఇనుము | '000 టన్నులు | 1,757 | 1,261 |
| (బి) చక్కచేయబడిన ఉక్కు. | ,, | 635 | 394 |

| | యూనిట్. | 1955-56 కు అధనపు శక్తి | 1955-56 కు సాధనపు శక్తి |
|---|---|---|---|
| 2 సిమెంటు ... | 1,000 టన్నులు. | 2,026 | 2,108 |
| 3. జనుముతో తయారైనవి. | ,, | .. | 308 |
| 4. అమ్మోనియం సల్ఫేట్ | ,, | 402.6 | 403.7 |
| 5. అల్యూమినియం ... | టన్నులు. | 16,000 | 8,300 |
| 6. కాస్టిక్ సోడా .. | ,, | 18,400 | 21,625 |
| 7. గంధక ద్రావకము ... | 1,000 టన్నులు. | 70 | 101 |
| 8. పంచదార ... | ,, | 10 | 380 |
| 9. ప్రత్తి వస్త్రములు. | | | |
| (ఎ) కదుళ్ల సంఖ్య | ... | 350,000 | ... |
| (బి) నూలు ... | పౌనుల తూనిక (పది లక్షలలో). | 53 | 461 |
| (సి) మిల్లుగుడ్డ ... | గజములు (పది లక్షలలో). | 35 | 982 |
| (డి) చేనేతగుడ్డ .. | ,, | ... | 890 |
| 10. సైకిళ్లు ... | 1,000 సంఖ్య, | 410 | 429 |
| 11. పెట్రోలియం. | | | |
| (ఎ) ద్రవ పెట్రోలియం ఉత్పత్తులు. | పది లక్షల గ్యాలన్లలో. | ... | 403 |
| (బి) శిలాజిత్తు (మట్టి) తైలము. | 1,000 టన్నులు. | ... | 37.5 |
| 12 స్క్వాష్ ప్రింట్ ... | ,, | 30 | 27 |

ప్ర. కేంద్ర. స్టేట్ ప్రభుత్వములచే అప్పుడే పూనుకొనబడి యున్న నానా పారిశ్రామిక ప్రాజెక్టులను పూర్తిచేయవలెనను నిర్ణయమును మినహాయించి, ప్రణాళికయందు పారిశ్రామిక ప్రాథాన్యతల క్రమము యెట్లున్నది ?

ఉ. కేంద్ర, స్టేట్ల ప్రభుత్వములచే అప్పుడే నిర్వహించబడుచున్న నానా ప్రాజెక్టులను పూర్తిచేయుటకును, కొన్ని రక్షణ పరిశ్రమలను స్థాపించుటను మినహాయించి, పారిశ్రామిక రంగమునందు దిగువ వివరించబడుచున్న ప్రాథాన్యతల క్రమము సూచింపబడెను :

(1) జనుము, ప్లయ్-ఉడ్ వంటి ఉత్పత్తిసరకుల పరిశ్రమల లోను. ప్రత్తి వస్త్రములు, పంచదార, సబ్బు, వనస్పతి, రంగులు, మెరుగు నూనెలవంటి వినియోగార్థపు సరకుల పరిశ్రమలలోను, యిపుడున్న శక్తిని పూర్తిగా ఉపయోగించుట ;

(2) ఇనుము, ఉక్కు, అల్యూమినియం, సిమెంటు, ఫర్టిలైజర్లు, ప్రధాన రసాయనములు, యంత్ర పనిముట్లు పగ్గెరాలవంటి ఉత్పత్తి సరకులయొక్కయు, మూలాధారమైన సరకులయొక్కయు, పరిశ్రమలలో శక్తిని విస్తృతపరచుట ;

(3) ప్రస్తుతమువున్న లోటుపాట్లను సరిచేయుటకై సాధన సంపదనుబట్టి పారిశ్రామిక వ్యవస్థను బలపరుచు నుద్దేశముతో నూతన యంత్రములను స్థాపించుట. ఉదాహరణమునకు హరశోతము (జిప్సం) నుండి గంధకమును తయారుచేయుట, రెయాన్ నిమిత్తముగా రసాయనిక గిజరును తయారుచేయుట, ఇత్యాదులు.

ప్ర. ప్రభుత్వభాగములో ప్రధాన పారిశ్రామిక ప్రాజెక్టు లేవి? వానికి యెంత ఖర్చు కాగలదు?

ఉ. ఒక కోటి రూపాయలకు మించి మూలధనము వెచ్చింపబడ వలసియుండు ప్రభుత్వభాగమునందలి పారిశ్రామిక ప్రాజెక్టులు దిగువ వివరింపబడుచున్నవి :

| నిర్వహింపబడుచున్న ప్రాజెక్టులు. | ఏప్రిల్ 1, 1951 వరకు అయిన ఖర్చు (కోట్ల రూ.) | 1951-56 లో ఖర్చు. (కోట్ల రూ.) |
|---|---|---|
| 1. సింద్రీ ఫర్టిలైజర్ ఫ్యాక్టరి .. | 18.4 | 9.0 |
| 2. చిత్తరంజన్ లోకోమోటివ్ వర్క్సు ... | 10.2 | 4.7 |
| 3. ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్ .. | 1.2 | 1.3 |
| 4. మైసూరు ఇనుము, ఉక్కు పనుల వ్యాప్తి. | 2.2 | 2 8 |
| 5. ఉత్తర ప్రదేశ్ గవర్నమెంట్ సిమెంట్ ఫ్యాక్టరి. | 1.5 | 2.3 |
| 6. "నెపా" మిల్సు, మధ్యప్రదేశ్ ... | 2.25 | 2.0 |
| 7. సీర్ సిల్క్ లిమిటెడ్ ... | 3.81 | 2 0 |
| 8. మెషీన్ టూల్ ప్రోటోటైప్ ఫ్యాక్టరి (డిఫెన్సు). | లభ్యముకాలేదు. | లభ్యముకాలేదు. |

| నూతన ప్రాజెక్టులు. | మార్చి నెల 31, 1956 వరకు ఖర్చు. (కోట్ల రూ.) | మొత్తపు ఖర్చు. (కోట్ల రూ.) |
|---|---|---|
| 9. ఇనుము, ఉక్కు ... | 30.0 | 80.0 |
| 10. మిషన్ టూల్ ఫ్యాక్టరి .. | 9.78 | 9.78 |
| 11. హిందూస్థాన్ షిప్ యార్డ్సు, లిమిటెడ్ | 14.08 | 18.15 |
| 12. ఆల్ స్టీల్ ఇంటిగ్రల్ కోచ్ ఫ్యాక్టరి... | 4.00 | 4.00 |
| 13. పెనిసిలిన్ ఫ్యాక్టరి ... | 2.11 | 2.11 |

| నూతన ప్రాజెక్టులు. | మార్చి నెల 31, 1956 వరకు ఖర్చు. (కోట్ల రూ) | మొత్తపు ఖర్చు. (కోట్ల రూ). |
|---|---|---|
| 14. హిందూస్థాన్ కేబిల్స్, లిమిటెడ్ .. | 1.30 | 1.30 |
| 15 సంబరి సాల్ట్ వర్క్సు ... | 1.00 | 1.00 |
| 16. నేషనల్ ఇన్‌స్ట్రుమెంట్సు ఫ్యాక్టరీ | 1.86 | 1.86 |
| 17. రాడర్, వైర్‌లెస్ ప్రాజెక్టు (డిఫెన్సు) | లభ్యపడలేదు. | 7.00 |
| 18. హెవీ ఎలెక్ట్రికల్ ప్లాంట్ ప్రాజెక్టు (ప్రణాళికలో ఒక దఫా ప్రత్యేకించ బడిన రూ. 50 కోట్లలో నుండి వెచ్చించబడును). | 7.00 | 28.00 |

ప్ర. ఈ ప్రాజెక్టుల్ని యేర్పరచబడుటవలన, నేటి పారిశ్రామిక నిర్మాణమునందు లేరున్న సమన్విత స్వాంతవరకైనను యేర్పడగలదని తలచవచ్చునా ?

ఉ. తలచవచ్చును. అవి యేర్పరచబడుటలో అది ఒక్కటి మాత్రమే కారణము కాకున్నను, అట్టి సమన్విత యేర్పడజేయుటలో అది తోడ్పడగలదు. వ్యక్తుల భాగములోను, ప్రభుత్వ భాగములోను, అభివృద్ధి కలుగుట మూలముననే సమన్వితలేకుండుటను పూర్తిగా తొలగించుటకు సాధ్యముకాగలదు.

ప్ర. వ్యక్తుల ప్రయత్నమునకు వదలిపెట్టబడిన ప్రధాన పరిశ్రమలు యేవి ?

ఉ. 1948, ఏప్రెల్ నెలలో గావించబడిన పారిశ్రామిక విధాన తీర్మానము ననుసరించి, ఆయుధములు. మందుగుండు సామానుల

తయారీ, అణుశక్తి ఉత్పత్తి, దానిపై అధికారము, రైల్వే రవాణా యాజమాన్యము.నిర్వహణవంటి ప్రభుత్వముచేత నే పెంపొందించబడుటకు ప్రత్యేకించబడిన పరిశ్రమలు మాత్రము మినహాయించబడి. పారిశ్రామిక రంగమునందలి మిగిలిన వెల్ల వ్యక్తుల ప్రయత్నమునకు వదలివేయ బడెను. నేలబొగ్గు, ఇనుము, ఉక్కు, వాయువిమానములను నిర్మించుట, నౌకా నిర్మాణము, టెలిఫోను, టెలిగ్రాఫ్, వైర్‌లెస్ సాధనము లను తయారుచేయుట, ఖనిజసంబంధమైన చమురులు, ఇత్యాదులవంటి మరికొన్ని పరిశ్రమల విషయములోకూడా మరికొంత అభివృద్ధికి ప్రభుత్వము బాధ్యతను గలిగియున్నను, వ్యక్తుల ప్రయత్నము కూడా ఆవశ్యమైయున్నదని ప్రభుత్వము తలచు పరిమితివరకు ఈ పరిశ్రమ లలోకూడా వ్యక్తులు ఉద్యమించుటకు యేర్పాటుగలదు. ఉదాహరణ మునకు, ఖనిజసంబంధమైన చమురుల పరిశ్రమయొక్క అభివృద్ధి. ఇనుము, ఉక్కు ఉత్పత్తి పరిశ్రమాభివృద్ధి, ప్రభుత్వముచే పెంపొందించబడుటకు ప్రత్యేకించబడియున్నను, ఆ రెండు పరిశ్రమలను అభివృద్ధిపరచుటకు కేంద్ర ప్రభుత్వమువారు వ్యక్తుల ప్రయత్నమునకు యిటీవల అనుమతినిచ్చిరి. ప్రభుత్వముచే పెంపొందించబడుటకు పూనుకొనబడిన కొన్ని ప్రాజెక్టుల విషయమునకూడా ప్రభుత్వమువారు, వ్యక్తుల మూలధనము పాల్గొనవచ్చునని ఆహ్వానించుచున్నారు. కావున రక్షణ పరిశ్రమలను మినహాయించి, మిగిలిన పారిశ్రామిక రంగ మంతయు వ్యక్తుల ప్రయత్నమునకు తెరచియుంచబడియున్నది. కాని, వ్యక్తుల ప్రయత్నము, 1951 వ సం॥పు పరిశ్రమల (అభివృద్ధి, నియమముల) చట్టము ననుసరించి కేంద్ర ప్రభుత్వముయొక్క నిబంధన లకును, వశమునకును కట్టుబడవలసియున్నది.

ప్ర. ప్రజాసామాన్యము యొక్క శ్రేయోదాయములను పాటించక తాను మాత్రము సౌభాగ్యవంతమై యుండుటకు వ్యక్తుల భాగమునకు సంపూర్ణాధికారము యొసగబడెనా ?

ఉ. లేదు. పారిశ్రామిక రంగమునందు అధిక భాగము వ్యక్తుల ప్రయత్నమునకు వదలబడియున్నను, ఆ పనులను నిర్వహించుటలో హద్దులేర్పరచబడియున్నవి. వ్యక్తుల ప్రయత్నము, పంచవర్ష ప్రణాళిక యొక్క సాంఘికాశయములకు అనుగుణముగను, జాతీయ శ్రేయోదాయములకు అనుగుణముగను నడచునట్లు చేయుటకై పరిశ్రమల (అభివృద్ధి, నియమముల) చట్టమునందలి 15, 16. 17 వ సెక్షన్‌ల ననుసరించి, పారిశ్రామికోద్యమములు పనిచేయుటనుగూర్చి విచారించుటకును, కొన్ని సందర్భములలో వానిని వశపరచుకొనుటకును, కేంద్ర ప్రభుత్వము అధికారమును పొందియున్నది. దానికి తోడుగా, పరిశ్రమల అభివృద్ధికి దోహదము నిచ్చుటలో పారిశ్రామిక నిర్వహణ, న్యాయసమ్మతమైన తన పాత్రను నిర్వహించెడు ఒక సేవయొక్క ప్రమాణమునకు అనుగుణముగ నుండునట్లు చేయుటకై ఇండియన్ కంపెనీల చట్టమునందు కొన్ని సవరణలను చేయుటకుకూడా ఉద్దేశించబడియున్నది.

ప్ర. అతి బాహుళ్యపద్ధతిమీద పారిశ్రామిక వ్యాప్తికి పూనుకొనునట్లు చేయుటకై వ్యక్తిగతమైన ప్రయత్నమునకు ప్రోత్సాహ కారణములను జూపవలెనని ఈ ప్రణాళిక సిఫారసు చేయుచున్నదా ?

ఉ. అపారమైన మూలధనమును వెచ్చింపవలసియుండు పరిశ్రమలను స్థాపించుటలో, ఒక్కొక్కప్పుడు కోట్లకొలది రూపాయలుగూడా

పెట్టుబడిచేయబడవలసియుండు పరిశ్రమలను నెలకొల్పుటలో, ప్రభుత్వముయొక్క సహాయము సహజముగనే అవసరమైయుండును. అట్టి తోడ్పాటు లేనియెడల, ఈ ఉద్యమములలో ప్రారంభించుటకు పెట్టుబడి చేయువారికి అవసరమైన విశ్వాసము కలుగజాలదు. అతిప్రాముఖ్యమైన పెట్టుబడులకు మూలధనము లభ్యమగునట్లు చేయుటకై, చౌక రేట్లపై విద్యుచ్ఛక్తిని సంభరాచేయుట, ప్రధాన సరకులమీదను, ముడిపదార్థముల మీదను విధింపబడియున్న సుంకము దిగుమతి సుంకము తగ్గించుట, లేక రక్షణను అభయమునిచ్చుట, ఇట్టివాని మూలమున నిర్దిష్టమగు ప్రోత్సాహ కారణముల పద్ధతి అవసరమని ప్రణాళికయందు గుర్తించబడెను. ఈ ప్రోత్సాహ కారణములు, ప్రణాళికలో తెలుపబడిన ప్రకారముగా, "ఒక్కొక్క పరిశ్రమయొక్క అవసరముల ననుసరించి వివేకముతో" ఉపయోగింపవలసియున్నది.

ప్ర. గడచిన కొన్నేండ్లలో విదేశములనుండి వచ్చిన మూలధనము యేల యింత స్వల్పముగాయున్నది? ఏక్కువగా వచ్చుటకై యిపుడు అనుకూలతలు యేర్పరచబడెనా?

ఉ. ఒక దేశములోనికి విదేశీయుల మూలధనము ప్రవేశించుట కొన్ని సంగతులపై - రాజకీయ, ఆర్థిక సుస్థిరత, పన్నుల విధింపు మట్టములు, వ్యక్తిగతమైన ఉద్యమము పనిచేయు విషయమున అనుసరించబడు విధానము, ఇత్యాదులపై ఆధారపడియుండును. గడచిన కొన్ని సంవత్సరములలో విదేశముల మూలధనము ఇండియాకు స్వల్పముగవచ్చుటకు రెండు హేతువులను తెలుపవచ్చును: దేశ విభజన జరుగుట, స్వాతంత్ర్యము సిద్ధించుట, దీనికి ఫలితముగా ఈ దేశముయొక్క రాజకీయ, ఆర్థిక సుస్థిరత విషయమున విదేశములలను

అవిశ్వాసమేర్పడుట కారణముగా నుండును. ఈ దేశముయొక్క భవిష్యద్భాగ్యోదయ విషయమున విదేశ పెట్టుబడిదార్లకు యిపుడు విశ్వాసము ఏర్పడుచున్నదనుటకు కొన్ని నిదర్శనములు గలవు: ఇనుము, ఉక్కు ఉత్పత్తులను హెచ్చించుటలో తోడ్పడుటకై ఋణముల నివ్వ ఐ.ఐ.ఎస్.సి.ఒ. జయప్రదముగ సమాధానమును కుదుర్చుకొనుట; దామోదర్ వాలీ కార్పొరేషన్‌చే విద్యుచ్ఛక్తి పెంపునకు ఋణములు బడయబడుట; ప్రపంచములో పెట్రోల్‌ను ఉత్పత్తిచేయు మూడు గొప్ప కంపెనీలు, ఈ దేశములో పెట్రోలియంను చక్కజేయు పరిశ్రమను స్థాపించుటకై విదేశముల పెట్టుబడులను పెట్టుటకు నిశ్చయించుట; యివియన్నియు విదేశ పెట్టుబడిదార్లకు ఈ దేశమునందు విశ్వాసము కుదురుచున్నదనుటకు సూచనలుగా నున్నవి. ప్రస్తుతము జరుగుచున్న ఉద్యమములను జాతీయము గావించుటకు ప్రణాళిక కాలములో ప్రాధాన్యత నివ్వరాదని ప్లానింగ్ కమిషన్‌చే గావించబడిన సిఫారసు ప్రభుత్వమువారిచే ఆమోదించబడెను ఇదియు. విదేశముల పెట్టుబడులకు యెక్కువ అనుకూల వాతావరణము నేర్పరచుటలో ఒక కారణభూతమై యున్నది.

# కుటీర పరిశ్రమలు

ప్ర. కుటీర పరిశ్రమలను పెంపొందించుటకై యేమి చేయబడ నున్నది ?

ఉ. కుటీర పరిశ్రమలచే యెదుర్కొనబడుచున్న ముఖ్యమైన కష్టములెల్ల బ్రహ్మాండమైన మిల్లుల పోటీనుండియు, ద్రవ్యలోపము వల్లను, ముడిసరకులను సరఫరాచేయుటకు కట్టుబాటు లేకపోవుటచేతను చేసిన వస్తువులను విక్రయించుటకు సదుపాయములు లేనందునను. కుటీర పరిశ్రమల ఉత్పత్తులు శ్రేష్ఠమైనవిగ నుండుటకు మేలైన పద్ధతుల నేర్పరుచ సక్రమ ప్రయత్నము చేయబడకుండుటవల్లను ఉదయించుచున్నవి. దేశ ఆర్థిక వ్యవస్థలో కుటీర పరిశ్రమలు ఒక ప్రముఖమైన పాత్రను వహింపవలసియున్నదనియు, ఇతర రంగములందు అదనముగానుండు పనివారికి ఈ కుటీర పరిశ్రమలు పనులను కలిగించ శక్తిని గలిగియున్నవనియు, ప్రజాళిక గుర్తించెను. కుటీర పరిశ్రమ లందు యిపుడు పనిచేయుచున్న కళాభిజ్ఞులకును, పనివారికిని, ఆ పరిశ్రమలు చేతినిండుగ పనుల నివ్వగలిగి యుండగలవు. కుటీర పరిశ్రమలను బలపరచి, వానిని పెంపొందింపజేయుటకై దిగువ వివ రించబడుచున్నవానివంటి పలువిధములైన చర్యలను పుచ్చుకొనుటకు ఉదేశించబడియున్నది :

(i) కుటీర, చులకన పరిశ్రమలకొరకై పరిశోధనాలయము లను స్థాపించుట ;

(ii) ముడివస్తువులను కొనుగోలు చేయుటకును, తయారు చేయబడినవానిని విక్రయించుటకును, కుటీర పరిశ్రమ

లలో పనిచేయువారిని సహకార సంఘములుగా కూర్చుట ;

(iii) ఖాదీ పరిశ్రమలతో పోటీ లేకుండునట్లు జేయుటకై కొన్నిటియందు ఉత్పత్తులను ప్రత్యేకించుట ;

(iv) ఒక కుటీర పరిశ్రమయొక్క మేలుకొరకై అదేవిధమైన ఖారీ పరిశ్రమపై పన్ను విధించుట ;

(v) సాధ్యమైనవానిలోనెల్ల, ప్రభుత్వశాఖలచే కుటీర పరిశ్రమల ఉత్పత్తులకే ప్రాముఖ్యత యొసగబడుట,

ప్రభుత్వమువారు మూడు సంఘములను— అఖిల భారత ఖాది మరియు గ్రామ పరిశ్రమల సంఘము, అఖిల భారత చేతిపనుల సంఘము, చేమగ్గముల సంఘములను అప్పుడే యేర్పాటుచేసిరి. ఈ సంఘములు, తమకు సంబంధించిన కుటీర పరిశ్రమల విషయములో కార్యక్రమము లను యేర్పరచి కొనసాగించును.

# రవాణా, రాకపోకల మార్గములు

ప్ర. రవాణా, రాకపోకల మార్గముల కార్యక్రమమునందు, మొత్తపు మూలధనములో సగపాలుకు మించియే రైల్వేలకు వెచ్చింపబడుచున్నది. ఇది న్యాయమనుట యెట్లు ?

ఉ. రైల్వేలను అత్యున్నతి మట్టపు సమర్థతతో నుండునట్లు సంరక్షించి, ఎదుగుచున్న అవసరములను దీర్చగలిగి యుండునట్లు వ్యాప్తినొందించుట, వ్యావసాయక, పారిశ్రామిక అభివృద్ధికి ముఖ్యావశ్యకమై యున్నది. యుద్ధము మూలమున, క్రొత్తవానిని ఉపయోగించుట చాలా వరకు పేరుకొనిపోయినది, వానినెల్ల సరిచేయుటకును, నిరంతరము పెరుగుచున్న ప్రయాణీకులకు సౌకర్యముల నొసగూర్చుటకును, ప్లానులో సంకల్పించబడియున్న గొప్ప వ్యయమును చేయకయే సాధ్యము కాజాలదు. నూతనమైన వానికొరకై సాధారణముగా వెచ్చించబడు చున్న సాలుకు రూ. 30 కోట్లరు తోడుగా, రైల్వే కార్యక్రమముపై ప్రణాళికలో ప్రత్యేకించబడిన రూ. 250 కోట్లు యథార్థముగా అవసరములకు చాల జాలదని యెంచబడెను. కావున, ప్రధాన పరిశ్రమలకును, రవాణాకును ఒకేదఫా ప్రత్యేకించబడియున్న రూ. 50 కోట్లలో నుండి రైల్వేలకు మరికొంత ప్రత్యేకించబడవలసియుండును.

ప్ర. చిత్తరంజన్ లోకొమోటివ్ వర్క్సు, టాటా ఇంజనీరింగ్, అండ్ లోకొమోటివ్ కంపెనీ, క్రొత్త రైల్వే ఇంజన్లకు గల అవసరములను యెంత మాత్రము తీర్చగలవు ?

ఉ 1951 వ సం॥ మార్చి నెలవరకు, ప్రాత రైల్వే ఇంజనులకు బదులు 1,050 క్రొత్తవి ప్రవేశ పెట్టబడవలసియుండెను. వానికి

తోడుగా ప్రణాళిక కాలమునందు అట్టివి ఇంకను 1,042 ప్రవేశ పెట్టబడవలసి యుండునని యెన్నబడుచున్నది. అదేకాలములో చిత్తరంజన్ లోకొమొటివ్ వర్క్సు, టాటా ఇంజినీరింగ్ అండ్ లోకామొటివ్ కంపెని, క్రమముగా 268 ఇంజెన్‌లను, 170 ఇంజన్‌లను, మొత్తము 438 ఇంజెన్‌లను, తయారు చేయగలవని తలచబడుచున్నది. సుమారు 600 రైల్వే ఇంజెన్‌లు దిగుమతి చేయబడునని యెన్నబడుచున్నది. కాని, విదేశములనుండి అవసరమైన క్రొత్త రైల్వే ఇంజెన్‌లు ఇంకను యెక్కువగనేయున్నవి. ప్రణాళిక కాలము ముగింపునకు వచ్చునప్పుడు, ప్రాత రైల్వే ఇంజెన్‌లకు బదులు క్రొత్త వానిని ప్రవేశపెట్టుటలో ఇంకను కొరత మిగిలియే యుండును. అప్పటికి, చిత్తరంజన్ లొకొమొటివ్ వర్క్సు, టాటా ఇంజినీరింగ్ అండ్ లోకామొటివ్ కంపెని, సాలుకు క్రమముగా 100 ఇంజెన్‌లను, 50 ఇంజెన్‌లను తయారు చేయుచుండవలెను. ప్రాత ఇంజెన్‌లకు బదులు క్రొత్త వానిని ప్రవేశపెట్టుటలో వెనుకబడకుండినయెడల, సాధారణముగా అట్లు చేయబడవలసియుండు ఇంజెన్‌ల సంఖ్య సుమారు సాలుకు 190 యై యుండును.

ప్ర. మూడవ తరగతి ప్రయాణీకులకు సౌకర్యములను కలుగజేయవలెనని నిరంతరము కోరబడుచున్నది. ప్రణాళిక యీ సంగతిని గుర్తించినదా ?

ఉ. గుర్తించినది. ప్రయాణీకులకు సౌకర్యములను కలిగించుటకై ప్రణాళిక రూ. 15 కోట్లను ప్రత్యేకించెను. ఈ మొత్తములో యెక్కువ భాగము, మూడవ తరగతి ప్రయాణీకులకు చేయబడు సౌకర్యములకే ఉపయోగించబడును.

ప్ర. పారిశ్రామికాభివృద్ధికి ఫలితముగా యేర్పడగల సరకుల, ప్రయాణీకుల రాకపోకల విస్తృతికి అనుగుణంగా యేర్పాటు చేయబడెనా ?

ఉ. పారిశ్రామికాభివృద్ధికి ఫలితముగా హెచ్చగల రవాణా విస్తృతికి తగినట్లు చేయ రైల్వే కార్యక్రమమునందు కొంత యేర్పాటు చేయబడియున్నది. ఒక నూతన పారిశ్రామిక ప్రాజెక్టుయొక్క ఫలితము రైలు రవాణాపై యెట్లు చూపుచున్నదో ఒక్క చక్కని నిదర్శనము తెలుపవచ్చును. సింద్రీ ఫర్టిలైజర్ ఫాక్టరీకి రైల్వేలు ప్రతిదినము 1,000 టన్నులకు మించిన జిప్సంను బికనీర్‌లోని గనులపద్ద నుండి కదలించవలసియున్నది. దీని అర్థ మేమనగా, ఒక రైలుబండి నిండుగా తీసుకొని పోవలసియున్నదనుటయే. రవాణాలో జరిగెడి విస్తృతిని రెండు విధములుగా నిర్వహించ వీలున్నది : రైల్వే వాగెనులను హెచ్చించుటద్వారా యును, రైల్వే మార్గముల శక్తిని పలువిధములుగ హెచ్చించుట మూలముననూ ఆ విస్తృతిని నిభాయించవచ్చును. ప్రాత రైలు వాగెనులకు బదులు క్రొత్త వాగెనులను ప్రవేశపెట్టుటలో చాలా వెనుకబడియున్నందున, ఆ కొరతను తీర్చవలెనేని వాగెనులను హెచ్చు చేయుటకు సాధ్యము కాజాలదు. అయినను, ప్రధాన పరిశ్రమలకును, రవాణాకును, ఒకే దఫా ప్రత్యేకించబడిన రూ. 50 కోట్లలోనుండి మరి కొంత రైల్వేలకు ప్రత్యేకించి, పెరుగుచున్న పారిశ్రామికావసరములను రైల్వేలు తీర్చగలుగునట్లు చేయుటకై ఉద్దేశించబడియున్నది.

ప్ర. నావలలో సరకులను యెగుమతిచేయు విషయమున ప్రభుత్వ విధానముయొక్క రెండు ప్రధానాశయములు, (1) కోస్తా వ్యాపారమును భారతీయ నౌకలకే ప్రత్యేకించుట,

(2) విదేశ వాణిజ్యమునందు భారతీయ నావలు మరి కొంత యెక్కువగా పాల్గొనునట్లు చేయుట. ఈ విధానమును ఆచరణకు బెట్టుటకు ప్రణాళికలో యేమి సూచింపబడియున్నది?

ఉ. కోస్తా వ్యాపారమును ప్రత్యేకించు విధానమును సఫలీ కృతముగ ఆచరణకు పెట్టుటకై, కోస్తా వ్యాపారమునందు ఉపయోగించబడుచున్న భారతీయ నౌకా సముదాయముయొక్క భారము 2 లక్షల టన్నుల నుండి సుమారు 3 లక్షల టన్నులవరకు హెచ్చించబడవలసియున్నది. కోస్తా వ్యాపారమునందు పనిచేయుచున్న భారతీయ నావల కంపెనీవారు 65,000 జి.ఆర్.టి. టన్నుల నావలను అధికముగా పొందగలుగునట్లు తోడ్పడుటకై యీ ప్రణాళిక, ద్రవ్యమును ప్రత్యేకించియున్నది. దీనికి తోడుగా, విశాఖపట్నం నౌకా నిర్మాణస్థానమువద్ద నిర్మింపబడెడు నావలలో కొంత భాగము కోస్తా వ్యాపారమునందు పనిచేయుచున్న నావల సమూహమునకు పొందబడును. పంచవర్ష ప్రణాళికయందు హిందూస్థాన షిప్‌యార్డ్ లిమిటెడ్, కంపెనీ కొరకై కేటాయించబడియున్న మొత్తములో, ఆ నౌకా నిర్మాణస్థలము వద్ద నిర్మితములగు నావలను కొనుగోలు చేసుకొనుటకు సౌకర్యమును కలిగించుటకై షిప్పింగ్ కంపెనీలకు సులభమైన షరత్తులమీద ఋణముల నిచ్చుటకు కొంతభాగము ప్రత్యేకించబడియున్నది.

విదేశ వ్యాపారములో భారతీయ నావలు సాఫల్యముగా పాల్గొను విషయమున, 1,10,000 జి.ఆర్.టి. కొనుగోలు కొరకై. షిప్పింగ్ కంపెనీలకు ఋణముల నివ్వ యీ ప్రణాళిక విధులను ప్రత్యేకించెను. ఈ అదనపునావలు, ఇండియన్ షిప్పింగ్ కంపెనీలు విదేశ వ్యాపారమునందు మరి కొంత ఫలవంతముగ పాల్గొనగలుగునట్లు తోడ్పడగలవు.

ప్ర. దేశ విభజనకును. ఇండియాలోని రేవులను పెంపొందింపవలసిన ఆవశ్యకతకును, సంబంధ మేమి ?

ఉ. రాజస్థానము, తూర్పు పంజాబ్, తత్పరిసర ప్రాంతములకు, తమ సరకులను వెలుపలికి పంపుటకు కరాచి ఉపయోగపడుచుండెను. కరాచీ కోల్పోవబడుటచే ఆ ప్రాంతముల సరకు బొంబాయికి మళ్లించ బడవలసి వచ్చెను. తత్ఫలితముగా, బొంబాయిరేవుకు అదనపు ఒత్తిడి కలిగెను. ఇదివరకు కరాచీ ఉపయోగపడుచుండిన ప్రాంతములకు ఉపకరించునట్లు చేయుటకై కాండ్లా యిపుడొక గొప్పరేవుగా అభివృద్ధి పరచబడుచున్నది. ఈ రేవు, 1956 వ సం॥ నాటికి సాలుకు 850,000, టన్నులను రవాణా చేయగలిగియుండును.

ప్ర. చమురును చక్కజేయు యంత్రములు ఇండియాలో స్థాపించబడుచున్నవి. రేవులో అవసరమైన సదుపాయము లను హెచ్చించుటకు ప్రణాళిక యెంతవరకు యేర్పాటు చేసినది ?

ఉ. నూతనముగా యేర్పడుచున్న చమురును చక్కజేయు స్థానములు రెండింటికి అవసరమైన రేవు సదుపాయములును, రవాణా సౌకర్యములును, ట్రాంబే ద్వీపము (బొంబాయి) వద్ద యేర్పాటు చేయ బడుటకై రూ 8 కోట్లు ప్రత్యేకించబడెను. విశాఖపట్నంవద్ద స్థాపించ బడనున్న చమురును చక్కజేయు మూడవ స్థానము విషయమున (యీ స్థాపన విషయమున ఇటీవలనే ఒప్పందము కుదిరి, సంతకములు చేయబడెను.) నిష్కర్షగా యేమియు ప్రత్యేకించబడకున్నది. కాని, అచ్చట అవసరమైయుండు అదనపు రేవు సదుపాయములకు, ప్రధాన పరిశ్రమలకును, రవాణాకును ఒకే దఫాగా ప్రత్యేకించబడిన రూ. 50 కోట్లలోనుంచి వెచ్చించబడగలదు.

ప్ర. ప్రణాళిక ననుసరించి ప్రధాన రేవులవద్ద జరుపబడు అభివృద్ధి కార్యములలో ముఖ్యాంశము లేవి ?

ఉ. కలకత్తావద్ద జరుపబడెడు పనులలో ముఖ్యమైనవి ఇవి : గోర్డెన్ రీచ్ జెట్టీ (ఓడలో సరకులు యెక్కించబడి, దింపబడు స్థానము) ను పునస్థాపిత మొనర్చుట, మనుజులచే నేలబొగ్గును ఓడలోనికి యెక్కించి, దింపుటకు రెండు దొరువులు, ఇతర లోహములను యంత్రముల సహాయముతో యెక్కించి, దింపుటకు ఒక దొరువు, నదీ లోయ ప్రాజెక్టుల నిమిత్తముగా దిగుమతి చేయబడు భారీ యంత్రములను, ఉపకరణములను, యెత్తి దింపగల ఒక భారి యంత్రము, స్థలాంతరములకు వానిని తీసుకొనిపోయి చేర్చగల వాగన్‌లు, రైల్వే ఇంజెన్‌లు, కొనుగోలు చేయబడుట.

బొంబాయివద్ద జరిగెడి ముఖ్య పనులలో, ప్రిన్సస్, విక్టోరియా డాక్‌లను నవీనపరచుట, ట్రాన్సిట్ షెడ్‌లను పునర్నిర్మాణము గావించుట, అలెగ్జాండ్రా డాక్స్‌వద్ద బరువులను యెత్తెడి విద్యుచ్ఛక్తితో కూడిన యంత్రములను నెలకొల్పుట, చేరియున్నవి.

మద్రాసు రేవు కొరకై యున్న కార్యక్రమమునందు, రూ, 2.07 కోట్లు వ్యయము కాగల ఒక వెట్—డాక్ స్కీం, పెట్రోలియం నిమిత్తముగా సర్వకాల సర్వావస్థలలో ఉపయుక్తమగు రెండు దొరువుల నిర్మాణము, చేరియున్నవి.

సామాన్య సరకుల కన్నిటికిని ఉపయోగపడగల నూతన దొరువులను నిర్మించుటకు కొచ్చిన్ రేవు కార్యక్రమములో యేర్పాటు చేయబడి యున్నది.

ప్ర. సివిల్ అవియేషన్ కంపెనీలెల్ల ఒక్కటిగా కూడపలెనని ప్రణాళిక యేల సూచించుచున్నది? ఇపుడున్న కంపెనీ లకు నష్ట పరిహారము చెల్లించబడునా?

ఉ. రవాణాభారము, జరుపబడెడి క్రియలు, వీనియొక్క ప్రస్తుతపు పరిస్థితులలో ఇపుడున్న వాయు విమాన రవాణా కంపెనీలు లాభకరముగ పనిచేయజాలవని విచారణలవల్ల తెలిసినది. వాయు విమాన రవాణా కంపెనీలు స్వచ్ఛందముగ పునర్నిర్మాణ మొనర్చుకొనపలెనని "ఏర్ ట్రాన్సుపోర్టు ఎన్క్వయరీ కమిటీ" చేసిన సిపారసు వ్యర్థమగుటచేత. ప్రస్తుతము ఉన్న కంపెనీలనెల్ల, యేకైక సంస్థగా లీనపరచపలెనని కమిషన్ సిపారసుచేసెను. ఇట్లు లీనపరచుటవల్ల కావలసిన విమాన ముల సంఖ్య తగ్గగలదు; వానిని నడుపుటకు అగుచున్న వ్యయముకూడా తగ్గగలదు.

ప్రస్తుతము ఉన్న వాయువిమాన కంపెనీల ఆస్తులను పొందుటకై క్రొత్తగా స్థాపింపబడుచున్న సంస్థ న్యాయసమ్మతమైన మొత్తములను చెల్లించును. ఈ కంపెనీలు యిష్టపడినయెడల, యిపుడు అవి కలిగి యున్న వాటాలకు బదులుగా నూతన సంస్థయందు వాటాలను పొందుటకు అనుమతించబడును.

ప్ర. రోడ్లులేనందుచేతనే గ్రామసీమలు అభివృద్ధినొందక వెనుకబడియున్నవని తెలుపవచ్చును. సంఘ ప్రయత్నము ద్వారాప్రజలే రోడ్లను నిర్మించుటకు ప్రోత్సహింప ప్రణాళిక ఉద్దేశించుచున్నదా?

ఉ. సంఘాభివృద్ధికరమైన ప్రాజెక్టులలో, స్వచ్ఛందమైన ప్రయ త్నముమూలమున రోడ్లను నిర్మించుటకు ప్రధానస్థాన మివ్వబడి

మున్నది. ఈ ప్రాజెక్టులు కొనసాగెడు ప్రాంతములలో, ప్రణాళిక కాలమునందు 16,000 మొదలు 17,000 మైళ్లవరకు నిడివిగల మట్టి రోడ్లు నిర్మించబడగలవని అంచనవేయబడెను. ఇతర చోట్లలో గూడా రోడ్లను నిర్మించుటకు స్వచ్ఛందమైన ప్రయత్నము ముందునకు రాగలదని ఆశించబడుచున్నది. గవర్నమెంటువారిచే సహాయధనము యొసగబడుటమూలమున అట్టి ప్రయత్నమును ప్రోత్సహింప "స్థానిక కార్యముల" కొరకై ప్రణాళికలో 15 కోట్ల రూపాయలు ప్రత్యేకించ బడియున్నది.

ప్ర. గ్రామ రోడ్లు గాక. జాతీయ రహదారులను, స్టేట్ రోడ్లను అభివృద్ధిపరచుటకు గల కార్యక్రమము యేమి?

ఉ. జాతీయ రహదారుల విషయమున, 220 మైళ్ల నిడివిగల క్రొత్త రోడ్లను, 18 గొప్ప వంతెనలను నిర్మించుటకై అప్పుడే ప్రారంభమైన పనులను పూర్తిజేయుటకును, 450 మైళ్ల నిడివిగల నూతన రోడ్లను, 43 గొప్ప వంతెనలను నిర్మించుటకును పంచవర్ష ప్రణాళికలో యేర్పాటుచేయబడియున్నది. దీనికి తోడుగా జాతీయ రహదారులలో 2,200 మైళ్ల నిడివిగల రోడ్డును బాగుపరచుటకు పూనుకొన బడును. ప్రణాళిక కాలము ముగింపునకు వచ్చునప్పటికి యీ నిడివిలో మూడింట రెండు పాళ్లు పూర్తికాగలదు.

స్టేట్ రోడ్ల విషయమున, 1955-56 లోగా సిమెంటు లేక తార్ రోడ్లను "ఎ" స్టేట్లలో 10,007 మైళ్లనుండి సుమారు 12,453 మైళ్ల వరకును, "బి" స్టేట్లలో 7,588 మైళ్లనుండి 8,129 మైళ్లవరకును హెచ్చించుటకు యీ ప్రణాళిక ఉద్దేశించియున్నది. "సి" స్టేట్లలో గూడా క్రొత్త రోడ్లు చాలా నిర్మించబడగలవు. తన్మూలమున యిప్పుడు అందుబాటులో లేని ప్రాంతములకు చేరుట సులభసాధ్యముగా నుండును.

# నివాస స్థానములు.

ప్ర. ఇండియాలో నివాసస్థానముల కొరతకుగల ప్రధాన కారణములేవి ?

ఉ. గడచిన 30 యేండ్లుగా భారతదేశ జన సంఖ్య అతివేగముగా పెరుగుచున్నది. దీనికి తోడుగా, లాభకరమైన పనులను, జీవిత సౌకర్యములను పొందుటకై గ్రామ ప్రాంతములనుండి నగరములకును, పట్టణములకును జనులు నిరంతరము వచ్చిచేరుచున్నారు. ఇందువల్ల పట్టణ ప్రాంతములలో గృహములకు కొరతయేర్పడెను. ఈ కొరత మొదట యుద్ధమువల్లను—అప్పుడు గృహనిర్మాణ కార్యములు క్షీణించెను—తరువాత దేశ విభజనవల్ల కాందిశీకులు అపరిమితముగా వచ్చుటచేతను యెక్కువయ్యెను.

ప్ర. నివాసస్థానముల కొరతను దీర్చుటకై కేంద్ర, స్టేటు ప్రభుత్వములు యేమిచేయుచున్నవి ?

ఉ. పశ్చిమ, తూర్పు పాకిస్థానములనుండి విశేషముగా వచ్చిన కాందిశీకులకు నివాసస్థానముల నేర్పరచుటకై ప్రభుత్వము కొన్ని పట్టణములను, కాలనీలను యేర్పాటుచేసెను. పశ్చిమ పాకిస్థానము నుండి వచ్చిన కాందిశీకులకొరకై సుమారు ఒక లక్ష గృహములును, తూర్పు పాకిస్థానమునుండి వచ్చిన కాందిశీకుల నిమిత్తముగా ఒకటిన్నర లక్షలకన్న యెక్కువగల గృహములను నిర్మించబడినట్లు ఇటీవలి లెక్కలవల్ల తెలియుచున్నది. స్థానిక సమస్యలను పరిష్కరించుటకై బొంబాయి గవర్నమెంటు, ఉత్తర ప్రదేశ్ గవర్నమెంటుల వంటి కొన్ని స్టేటు గవర్నమెంటులు ప్రత్యేక సంస్థలను స్థాపించెను.

ఆ సంస్థలు కొన్ని గృహములను నిర్మించుటలో కృతకృత్యత జెందెను. ఉదాహరణమునకు, బొంబాయి, కాన్పూరులలో, ముఖ్యముగా పరిశ్రమల పనివారికిని, రక్కువ జీతమును పొందువారికిని గృహములు నిర్మించబడెను. ప్లానింగ్ కమిషన్ యొక్క సిఫారసుల ననుసరించి, ఇండియా గవర్నమెంటుయొక్క "వర్క్సు అండ్ హౌసింగ్" మంత్రాంగము, ప్రభుత్వ "సహాయముతో పారిశ్రామిక గృహ వసతి" కై 1952 లో ఒక స్కీమును ఆచరణకు పెట్టెను

ప్ర. ప్రభుత్వమువారి గృహ నిర్మాణ స్కీముయొక్క పరిమాణము యెంత? తద్వారా యెంతమందికి లాభించగలదు?

ఉ. ప్రణాళిక కాలములో, ఇండియాయందు పరిశ్రమలలో పని చేయువారికి గృహవసతులను కల్పించుటకై ప్లానింగ్ కమిషన్ కేంద్ర నిధులలోనుండి 38.5 కోట్ల రూపాయలను ప్రత్యేకించెను.

ఫాక్టరీ పనివారికి గృహములను నిర్మించుటకై యీ నిధిలోనుండి స్టేట్ గవర్నమెంటులకును, పరిశ్రమల యజమానులకును, కార్మికుల సహకార సంఘములకును సహాయ ద్రవ్యము, ఋణములు, యొసగబడుచున్నవి. ఈ ప్రణాళిక జరుగు అయిదేండ్ల కాలములో యీనిధి యొక్క సహాయముతో 70 వేల మొదలు 80 వేల వరకు గృహములు నిర్మింపబడగలవని యెంచబడుచున్నది.

ప్ర. "ద్రవ్యసహాయముతో పారిశ్రామిక గృహనిర్మాణ స్కీం" అనగా నేమి?

ఉ. తక్కువ ఆదాయముగల తరగతులకు, వారు భరింపగల బాడుగలకు తగిన గృహములను వ్యక్తుల ప్రయత్నము యొసగజాల

కున్నందున ప్రభుత్వము సహాయధనమును, ఋణములను విశేషముగా నొసగవలసియున్నది. సహాయధనమివ్వబడు పారిశ్రామిక గృహ నిర్మాణ స్కీము ననుసరించి, చిన్న పట్టణములలో ఒక్కొక్కటి రూ॥ 2,700 ల వ్యయముతోను, పెద్దనగరములలో ఒక్కొక్కటి రూ॥ 4,500 ల వ్యయముతోను, కార్మికుల గృహములు నిర్మింపబడ గలవు. ఈ సహాయధనము, ఋణములు, కేంద్రప్రభుత్వముచే స్టేటు గవర్నమెంటులకివ్వబడును. స్టేటు గవర్నమెంటులు, ఆ మొత్త ములను చట్టసమ్మతముగా నేర్పడిన గృహనిర్మాణ సంఘములకు కేటా యించును. ఈ స్కీము ననుసరించి, సహాయధనము, ఋణములు, గృహముల నిర్మాణమునకగు మొత్తములో నూటికి క్రమముగా 25 వంతునను, 37 వంతునను, పరిశ్రమల యజమానులకును, గృహనిర్మాణ సంఘములకుచు గూడా యొసగబడును,

ప్ర. పాడుపడిన ప్రదేశములను చక్కజేయుట, యీ గృహ నిర్మాణ స్కీములో చేరియున్నదా ?

ఉ. గృహనిర్మాణ విధానములో పాడుపడిన ప్రదేశములను చక్క చేయుట ఒక ముఖ్యభాగమైయున్నది. క్రొత్త గృహప్రదేశములు పెంపొందించబడుచుండునపుడే ఆ పనిగూడా జరుగును. కావున, ప్రణాళిక కాలములో గృహనిర్మాణమునకై ప్రత్యేకించబడిన 38.5 కోట్ల రూపాయలలోనుండి ప్రతి సంవత్సరము కొంత భాగమును నగరాభివృద్ధి సంఘములకును, స్థానికాధికారులకును ఋణముగా నిచ్చుటకై వేరుగా నుంచవలెనని ప్లానింగు కమిషన్ సూచించెను, నగరాభివృద్ధి సంఘములు, స్థానికాధికారులు ఆ మొత్తములను పాడు పడినవానిని పొంది, నేలమట్టము గావించుటకు ఉపయోగింతురు

పాడుపడిన ప్రాంతలములను పొందుటలో నిర్బంధము యేర్పడినయెడల అదనపు నష్టపరిహారము నివ్వ నవసరములేదని కూడా ప్లానింగు కమిషన్ సిఫారసుచేసెను.

ప్ర. గ్రామప్రాంతములలో గృహసౌకర్యములను బాగుపరచుటకై యేమిచేయబడుచున్నది ?

ఉ. నానావిధములైన గృహ స్కీములకొరకై స్టేట్ గవర్నమెంటులు రూ. 10.19 కోట్లను ప్రత్యేకించెను. ఆ మొత్తమును ప్రణాళిక కాలములో గ్రామ ప్రాంతముల గృహవసతులను బాగు పరచుటకే ఉపయోగింపదగునని ప్లానింగు కమిషన్ సూచించెను. కాబట్టి యెగువ తెలుపబడిన మొత్తము గ్రామములలోని గృహ పరిస్థితులను బాగుపరచుటకును, కొన్ని గ్రామములలో మంచినీటి సరఫరాకును, మురికి నీరు పారిపోవుటకును, మంచి వీధి రోడ్లను నిర్మించుటకును, ఉపయోగించబడగలదు. కమ్యూనిటి ప్రాజెక్టుల పాలనాధికారులు కూడా, ప్రాజెక్టు ప్రాంతములలో నివాసస్థానములను అభివృద్ధిపరచుటకు ఒక కార్యక్రమమును గలిగియున్నారు.

# ఆరోగ్యము

ప్ర. పట్టణ ప్రాంతములలోను, పల్లె ప్రాంతములలోను, మంచి నీటి సరఫరాకు, మురికినీరు పారిపోవుటకు, అభివృద్ధి కార్యములను జరుప తగుమైన యేర్పాటులు గలవా?

ఉ. ఈ కార్యములను జరుపుటకు వాస్తవముగా చాలా వ్యయ పరుచబడవలసియుండును. అయినను, ప్రత్యేకించబడిన మొత్తము గొప్పదిగనేయున్నది. ప్లేనువారి ప్రణాళికలలో రూ. 23.49 కోట్లను ప్రత్యేకించినవి. ఈ మొత్తములో రూ. 12.12 కోట్లు పట్టణ ప్రాంతములలో మంచీనీటి సరఫరాకును, మురికినీరు పారిపోవుటకును ఉపయోగించబడును. రూ. 11.37 కోట్లు గ్రామ ప్రాంతములలో మంచినీటి సరఫరాకు ఉపయోగించబడును. కేంద్ర ప్రభుత్వము యొక్క ప్రణాళికలో స్థానికాధికారులకు తోడ్పడుటకై స్థానికాభివృద్ధి ఋణముల నిమిత్తముగా రూ. 30 కోట్లు ప్రత్యేకించబడియున్నది. ఈ మొత్తములో సుమారు రూ. 10 కోట్లు నీటి సరఫరా విషయములో అభివృద్ధిపరచుటకై ఉండగలదని తలచబడుచున్నది. ప్రజలు రొక్కరూపమునగాని లేక స్వచ్ఛంధమైన సేవరూపమునగాని తోడ్పడిన యెడల, ప్రత్యేకించబడిన ఈ మొత్తములు యెంతయో ఉపకరించ గలవు.

ప్ర. మలేరియా యావదేశమునందు అదుపులో నుంచుకొనబడు టకు ఉద్దేశించబడుచున్నది. ఎట్లు?

ఉ. గ్రామ ప్రాంతములలో క్రిమి సంహారక ఔషధమును వెద జల్లుటమీదను, మలేరియా నివారణౌషధములచే చికిత్స చేయబడుటమీదను

ఈ కార్యక్రమము ఆధారపడజేయబడియున్నది. ఈ పనులు, స్టేటుల ఆరోగ్య సేవల ఒక్క డైరెక్టరేట్లచే యేర్పాటుచేయబడి నడిపించబడ గల 125 ఫీల్డు మలేరియా కంట్రోల్ జట్లచే నిర్వహించబడును. ఈ కార్యక్రమమునంతటిని కేంద్ర ప్రభుత్వము సమన్వితపరచును. చౌకధరప కావలసినంత డి.డి.టి. సరఫరా యగుటకై (అప్పుడే సంకల్పించబడియున్న యంత్రమునకు తోడుగా) ఒక రెండవ డి.డి.టి. యంత్రమును నెలకొల్పుటకు ఈ ప్రణాళికలో గలదు. ఈ కార్యక్రమమును జరుపుటకు మూడేండ్ల కాలములో రూ. 15 కోట్లు వ్యయము కాగలదు. ఈ మొత్తములో రూ. 5 కోట్లు స్టేట్లును, రూ. 10 కోట్లు కేంద్ర ప్రభుత్వముయును టి.సి.ఎ. యొనగు సహాయముతో సహా సమకూర్చవలసియున్నవి.

ప్ర. క్షయవ్యాధితో పోరాడుటెట్లు ?

ఉ. డబ్ల్యు. హెచ్. ఒ., యు.ఎన్.ఐ.సి.ఇ.ఎఫ్. ల సహాయముతో యీ దేశమునందు బి.సి.జి. కార్యక్రమమును జరుపుటకు ఉద్దేశించబడియున్నది. తత్ఫలితముగా 15 ఏండ్ల మొదలు 20 ఏండ్లలోగా క్షయవ్యాధిచే సంభవించెడు మరణసంఖ్యను, ప్రస్తుతము యేర్పడియున్న సాలుకు 500,000 మరణసంఖ్యలో అయిదింట ఒక భాగమునకు మట్టగించుటకు సాధ్యముకాగలదు. ఆ రోగస్థులను వేరుగానుంచి చికిత్సచేయుటకై అవసరమైయున్న స్థానములవంటి ఇతర కంట్రోల్ చర్యలు చాలా తగ్గగలవు.

ఆరోగ్య ఆశ్రమములు (శానటోరియా, అనుపత్రులు, క్లినిక్ ల కును, రోగుల స్థానముల హెచ్చింపునకును, బి.సి.జి. వాక్సినేషన్ జట్లకును. కేంద్ర, స్టేటుల గవర్నమెంటులు గొప్ప మొత్తములనే

ప్రత్యేకించినవి. వ్యాధి సోకకుండునట్లు నివారించుటకును, అది సోకి నట్లు సందేహము కలిగినపుడు వ్యాధి లక్షణమును కనుగొని చికిత్స చేయుటకును, వ్యాధిగ్రస్తునికి గృహముపద్దనే కొన్ని సేవలను చేయుట కును యెక్కువ ప్రాముఖ్యత యొసగబడెను. ఈ క్రియలను జనుపు టకు బోధించుటకును, ప్రదర్శించి చూపుటకును మూడు ఆదర్శప్రాయ మైన కేంద్రములు ఢిల్లి, పాట్నా, తిరువనంతపురంలవద్ద అప్పుడే స్థాపించబడినవి. ఇంకను మరికొన్ని స్థాపింపబడనున్నవి. 1950-51 తో పోల్చి చూచినయెడల, 1955-56 కు దాదాపు ఈ హెచ్చింపులు ఏర్పడజేయుటకు ఈ ప్రణాళిక ఉద్దేశించుచున్నది :

| | 1951-52. | | 1955-56. | |
|---|---|---|---|---|
| | సంస్థలు. | స్థానములు. | సంస్థలు. | స్థానములు. |
| సెనటోరియా .. | 37 | 4,161 | 46 | 5,686 |
| ఆసుపత్రులు ... | 48 | 3,077 | 50 | 4,814 |
| క్లినిక్‌లు ... | 127 | 2,323 | 180 | 2,862 |
| బి.సి.జి. జట్ల సంఖ్య .. | 73 | | 137 | |

స్టేట్లయొక్కయు, కేంద్రముయొక్కయు, స్కీములకు మొత్తములో రూ. 4.31 కోట్లు వ్యయముకాగలదు.

ప్ర. తరిఫీదైన ఉద్యోగులకును, ఆసుపత్రులలో స్థానములకును, గల కొరతవల్ల ఏర్పడుచున్న కష్టములను ఈ ప్రణాళిక యెట్లు దాటనుద్దేశించినది ?

ఉ. వైద్య విద్య, తరిఫీదునకు కేంద్ర ప్రభుత్వము దాదాపు రూ. 6.5 కోట్లను, స్టేటు గవర్నమెంటులు సుమారు రూ. 14 కోట్లను ప్రత్యేకించినవి. ఆల్ ఇండియా మెడికల్ ఇన్‌స్టిట్యూట్ అత్యున్నత మట్టపు పరిశోధనలకును, పోస్టు-గ్రాడ్యుయేటు విద్యాభ్యాసమునకును

ఒక కేంద్ర సంస్థ యొక్క స్థాపన, కేంద్ర ప్రభుత్వముయొక్క కార్యక్రమములో చేరియున్నది. నూతన మెడికల్ కాలేజీలను పూర్తి చేయుట, ఇపుడున్న మెడికల్ కాలేజీలను, స్కూళ్లను వ్యాప్తి నొందించుట, నర్సులు, మంత్రసానులు, కాంపౌండర్లు వగైరాలవంటి సహాయవైద్య ఉద్యోగులకు తరిఫీదునిచ్చుట, ఇత్యాదులు స్టేట్ల కార్య క్రమమునందు చేర్చబడియున్నవి. ఈ స్కీములను కొనసాగించుట వల్ల, ఈ దేశములో ప్రతి సంవత్సరము హెచ్చుగల తరిఫీదైనవారి సంఖ్య మొత్తము 1951-52 మొదలు 1955-56 వరకు దిగువ రీతిగా నుండగలదని యెన్నబడుచున్నది :

| తరిఫీదైనవారు. | | 1950-51 లో. | 1955-56 లో. | పెరుగుదల నూటికి. |
|---|---|---|---|---|
| డాక్టర్లు | ... | 2,504 | 2,782 | 11.1 |
| కాంపౌండర్లు | ... | 894 | 1,621 | 81.3 |
| నర్సులు | ... | 2,212 | 3,000 | 35.6 |
| మంత్రసానులు | ... | 1,407 | 1,932 | 37.3 |
| వైద్యులు, హకీంలు. | ... | 914 | 1,117 | 22.2 |

ఆసుపత్రులు, డిస్పెన్సరీల విషయమున కేంద్ర, స్టేట్ల ప్రభుత్వములయొక్క కార్యక్రమమునకు రమారమి రూ. 24.6 కోట్లు వ్యయముకాగలదు. ఆసుపత్రులు, డిస్పెన్సరీలు, వానిలోని స్థానములు వీని సంఖ్యాహెచ్చింపు దిగువ రీతిగా నుండగలదని యెన్నబడుచున్నది

| | | 1950-51 లో. | 1955-56 లో. | హెచ్చుదల నూటికి. |
|---|---|---|---|---|
| ఆసుపత్రుల సంఖ్య | ... | 2,014 | 2,062 | 2.4 |
| డిస్పెన్సరీల (పట్టణ ప్రాంత) సంఖ్య. | | 1,258 | 1,695 | 24.8 |

| | 1950-51 లూ. | 1955-56 లూ. | హెచ్చుదల [illegible] |
|---|---|---|---|
| డిస్పెన్సరీల (గ్రామ ప్రాంత) సంఖ్య. | 5,229 | 5,810 | 11.6 |
| ఆసుపత్రులలో స్థానముల సంఖ్య. | 106,178 | 117,222 | 10.1 |
| పట్టణ ప్రాంత డిస్పెన్సరీ లలో స్థానముల సంఖ్య. | 2,013 | 2,233 | 11.4 |
| గ్రామ ప్రాంత డిస్పెన్సరీ లలో స్థానముల సంఖ్య. | 5,066 | 5,582 | 10.2 |

ప్ర. దేశీయ వైద్యపద్ధతికి ప్రోత్సాహము గలదా ?

ఉ. దేశీయ, తదితర వైద్యపద్ధతులలో పరిశోధనలను జరుపుటకై రూ. 37.5 లక్షలు ప్రత్యేకించబడెను. దేశీయ వైద్య పద్ధతులలో పరిశోధనలను జరుపుటకై జాం నగర్ వద్ద ఒక కేంద్ర పరిశోధనాలయమును స్థాపించుటకు కేంద్ర ప్రభుత్వము అనుమతించెను. దేశీయ పద్ధతులతో వైద్యముచేయుటయందు వృత్తికి సంబంధించిన తరిఫీదు విషయముకూడా చాలా శ్రద్ధగా ఆలోచింపబడెను. దేశీయ వైద్య పద్ధతులందు విద్యాభ్యాసమునకును, తరిఫీదునకును, స్టేట్ల గవర్న మెంటులు రూ. 95.23 లక్షలను ప్రత్యేకించెను. ఆసుపత్రులకును, డిస్పెన్సరీలకును, తదితర స్కీములకును రూ. 1.06 కోట్లను ప్రత్యేకించెను.

ఈ దేశములో ఓషధులు విస్తారముగా నున్నవి. వానిని యెక్కువగా ఉపయోగించుటకు ప్రభుత్వము కొన్ని చర్యలను బుచ్చుకొనెను. ముఖ్యమైన ఓషధులను (ఔషధ మొక్కలను) తగుమైన ప్రదేశములలో పెంచుటను అభివృద్ధిపరచుటకై భారత వ్యవసాయ పరిశోధన సంఘము

ఒక ఓషధుల సంఘమును నెలకొల్పెను. ఉత్తర ప్రదేశ్, కాశ్మీర గవర్నమెంటులుకూడా ఈ విషయములో చర్యలను బుచ్చుకొనుచున్నవి. విజ్ఞానశాస్త్ర, పారిశ్రామిక పరిశోధన సంఘము, లక్నోవద్ద ఒక మందు సరకుల పరిశోధనాలయమును స్థాపించెను. ఈ పరిశోధనాలయము సామాన్యముగా వాడబడుచున్న దేశీయ మందుసరకులను గూర్చి పరిశోధించి. వాని ప్రయోగసూత్రములను, వాని శక్తిప్రమాణములను కనుగొనును. ఔషధములను తయారుచేయుటను గూర్చి ఒక గ్రంథమును తయారుచేయుటకు భారత ప్రభుత్వము ఒక సంఘమును స్థాపించెను. ఆ గ్రంథమునందు ఆధునిక సంధానాత్మకమైన ఔషధములు, మందు సరకులను గూర్చియేగాక, దేశీయ ఓషధులనుండి తయారుచేయబడు మందు సరకులను గూర్చిగూడా వివరింపబడును.

ప్ర. ముఖ్యమైన మందు సరకుల ఉత్పత్తి, ప్రణాళికలో ప్రోత్సహించబడుచున్నదా ?

ఉ. పెనిసిలిన్, ఇతర కొన్నిమందులను తయారుచేయుటకై ఒక ఫ్యాక్టరీని స్థాపించుటకు భారత ప్రభుత్వము, యు.యన్.ఐ సి.ఇ ఎఫ్, తో ఒక సమాధానమును కుదుర్చుకొనెను. రెండు డి డి.టి. ఫ్యాక్టరీలను గూడా—ఒకటి, డబ్ల్యు. హెచ్.ఒ., మరియు యు యన్. ఐ.సి.ఇ.ఎఫ్. సహాయముతోను, రెండవది, మలేరియా కంట్రోలునకై టి.సి.ఎ. కార్యక్రమము ననుసరించియు —స్థాపించుటకు ఉదేశించబడి యున్నది.

ప్ర. కుటుంబమును పరిమితి పరచుటను గూర్చి ప్లాను చేయవలసిన అవశ్యమేమి ? ఆరోగ్య మంత్రాంగము యొక్క కార్యక్రమములోని ముఖ్యాంశము లేవి ?

ఉ. దేశముయొక్క పరిమితిగల సంపదల మీద, పెరుగుచున్న జనసంఖ్యయొక్క ఒత్తిడి, కుటుంబమును పరిమితపరచుటకు ప్లాను చేయవలసిన సమస్యను, జనాభా పెరుగుదలను అదుపులో నుంచవలసిన సమస్యను, దృష్టికి దెచ్చెను వైద్య విజ్ఞానము పురోభివృద్ధి నొందుట చేత మరణరేటు తగ్గెను, జననరేటు నిలుకడ గలిగియున్నది. తత్ఫలితముగా, జనసంఖ్య అతివేగముగా పెరుగుచున్నది. జననరేటు తగ్గిన యెడల జీవన ప్రమాణములో కొంత అభివృద్ధి జరుగగలదు, అట్టి అభివృద్ధి జరుగుటకు, జనసంఖ్య అతివేగముగా పెరుగుట ఒక ఆటంకముగా నున్నది. కావున, జనసంఖ్య పెరుగుదలను వశములో నుంచుకొనుటకు సంతాన పరిమితియొక్క ఆవశ్యకతను అతి బాహుళ్య పద్ధతిపై గుర్తించవలసి యున్నది. సంతానమును పరిమితిపరచుట యనగా, ఒక బిడ్డకును మరియొక బిడ్డకును హెచ్చు మధ్యకాలము ఉండునట్లు చేయుటయే, ఇట్లొనరించుట వాంఛనీయముగ నుండును ; యేలననగా, తన్మూలమున, తల్లి యెక్కువ ఆరోగ్యవంతురాలై యుండును, బిడ్డలను యెక్కువ జాగ్రత్తతో పోషించుటకు వీలగును. కాబట్టి, యీ ఆశయ సిద్ధి నిమిత్తముగా పుచ్చుకొనబడెడు చర్యలు, ప్రజారోగ్య కార్యక్రమము నందు అంతర్భాగమైయుండవలెను.

ఆరోగ్య మంత్రాంగముయొక్క ప్రణాళికయందు, దిగువ వివరించ బడుచున్న కార్యక్రమమునకై రూ 65 లక్షలు ప్రత్యేకించబడి యున్నది —

(1) వివాహితులైయుండి, కోరినవారికి, సంతానమును పరిమితి పరచు పద్ధతులను గూర్చి సలహానిచ్చుటకై గవర్నమెంటు ఆసుపత్రుల లోను, ఆరోగ్య కేంద్రములలోను యేర్పాటుచేయుట.

(2) సంతానమును పరిమితిపరచుటలో పలువిధములైన పద్ధతులు గలవు. ప్రజలలో నానాభాగములవారికి వాని ఉపయుక్తత, సఫలత, అంగీకార యోగ్యత, వీనినిగూర్చి నిర్ణయించుటకు రంగస్థల పరిశోధనలను జరుపుట,

(3) సంతానమును పరిమితిపరచుటకుగల పద్ధతులను ప్రజలకు నేర్పుటకై కార్యక్రమమును సిద్ధపరచుట.

(4) ప్రజలలో పలురకములైన భాగముల నుండి సంతాన విధమును గూర్చియు, కుటుంబముయొక్క పరిమాణమునకు సంబంధించిన వారి వైఖరులు, ఉద్దేశములను గూర్చియు, సంగతులను సేకరించుట.

(5) ఆర్థిక, సాంఘిక, జనాభా మార్పుల మధ్యగల సంబంధములను కనుగొనుట,

(6) సంతానమును పరిమితిపరచుటకై ఇండియాలోను, విదేశములందును, శాస్త్రరీతిగా పరిశీలింపబడిన పద్ధతులతో కుటుంబమును మట్టసపరచుటకు ఉపయోగించబడు పద్ధతులను గూర్చి సమాచారమును సేకరించి, పరిశీలించుట ; ఆ సమాచారమును, అదియే వృత్తిగా గలిగియున్న వారికి తెలియజేయుట.

(7) దేహశాస్త్రమునకును, మానవ ఫలవంతమునకును, దానిని వశములో నుంచుటకును, సంబంధించిన పరిశోధనలను జరుపుట.

# విద్య.

ప్ర. విద్య నిమిత్తముగా ప్రత్యేకించబడియున్న మొత్తము చాల జాలదని అంగీకరించబడినది గనుక ఆ ప్రత్యేకింపును యెంతమాత్రము హెచ్చించుటకు ప్రణాళిక పెట్టుచున్నది? దాని ఫలితము లెట్లుండును?

ఉ. విద్యాభివృద్ధికై కేటాయించబడిన వ్యయములో చాలా హెచ్చింపు చేయుటకు ప్రణాళిక ఉద్దేశించుచున్నది. స్థానికసంస్థలు ప్రోగుచేయగల నిధులను లెక్కకు గొనక, యీ ప్రణాళిక రూ 151.66 కోట్లను ప్రత్యేకించెను; అనగా, సరాసరి వార్షిక వ్యయము రూ 30.33 కోట్లు. ఈ ప్రణాళిక కాలమునకు ముందు సంవత్సరములో, 1950—51 లో, విద్యకొరకై వెచ్చించబడిన మొత్తము రూ 63.18 కోట్లుగా నుండెను. ఈ మొత్తములో రూ 19.55 కోట్లు అభివృద్ధికొరకై చేయబడిన వ్యయముగా యెన్నబడవచ్చును. సాలుకు రూ 19.55 కోట్ల నుండి రూ 30.33 కోట్లకు హెచ్చించబడుట, దాదాపు నూటికి 55 వంతున హెచ్చింపుగా నున్నది. విద్యా సమస్య బ్రహ్మాండమైన రూపును దాల్చియున్నందున, యీ ప్రత్యేకింపు ఇంకను చాలకున్నదని అంగీకరించబడుచున్నది. కాని, ద్రవ్య రూపమునను, భూములరూపమునను, సేవ, భవనముల రూపమునను విరాళముల నిచ్చి, ప్రభుత్వము యొక్క సాధనసంపదలను ప్రజలు తోడ్పడగలరని ఆశించబడుచున్నది.

ప్రణాళిక కాలాంతమున దిగువ వివరించబడుచున్న లక్ష్యములను సాధించుటకు సాధ్యము గలదని కమిషన్ నమ్ముచున్నది :—

(i) 1950—51 లో, 6—11 యేండ్ల మధ్య ప్రాయములైన పిల్లలు నూటికి 44.5 వంతున విద్యాభ్యాసము చేయుచుండిరి. ప్రణాళిక కాలాంతమున ఆ వయస్సు వారిలో నూటికి 60 చొప్పున విద్యాభ్యాసము చేయుట సంభవనీయము.

(ii) 11—17 సంవత్సరముల మధ్య వయస్సుగల బిడ్డలలో సెకెండరీ విద్య నభ్యసించుచుండువారి శాతమును, 1950—51 లో నుండిన నూటికి 11 నుండి నూటికి 15 కు పెంచుట.

(iii) సాంఘిక విద్యారంగమునందు, 14—40 యేండ్ల మధ్య వయస్సు గలవారిలో నూటికి 30 మంది చొప్పున సాంఘిక విద్యను బడయునట్లు చేయుట,

విశ్వవిద్యాలయ విద్య విషయములో లక్ష్యములు నిర్ణయించబడ లేదు. యేలననగా, ఇచ్చటి సమస్య, వ్యాప్తికి సంబంధించినదిగాక బలపరచబడవలసిన దానికి సంబంధించియున్నది.

ప్ర. ప్రస్తుతపు విద్యాపద్ధతి చాలా తీవ్రమైన విమర్శలకు పాలయ్యెను. ఆ పద్ధతిలో యెట్టి మార్పును కమిషన్ సిఫారసు చేసెను ?

ఉ. విద్యాపద్ధతి యందలి ప్రధాన దోషములలో నొకటి, శుద్ధ సారస్వతమునకు ప్రాముఖ్యత యివ్వబడి, అనుష్ఠాన భావములకు దోహద మివ్వబడకుండుటగా నున్నది. కాబట్టి, సకల ప్రాథమిక పాఠశాలలు బేసిక్ స్కూళ్లుగా మార్చబడవలెనని కమిషన్ సిఫారసు చేసెను. ఆ బేసిక్ స్కూళ్లలో సంఘమునందు ఉపయుక్తమైన ఒక

చేతిపని ద్వారా విద్యాబోధ గావించబడి, పిల్లల పరిపూర్ణమైన వ్యక్తిత్వము వికసించునట్లు చేయబడును. విద్యాభ్యాసము నందు సకల దశలలోను శరీరకష్టముతో గూడిన పని, పాఠ్యవిషయములలో చేరి యుండును. బేసిక్ విద్యాపద్ధతి ననుసరించి ఒక "రూరల్ యూనివర్సిటీ" ని (గ్రామీణ విశ్వవిద్యాలయమును) స్థాపించవలెనని కూడా కమీషన్ సిఫారసు చేసెను ఆ విద్య, యూనివర్సిటీ దశలో నూతన పద్ధతులందు అనుభవమును ఒసగగలదు. యువతీ యువకుల శిబిరములకై రూ 1 కోటి ప్రణాళికయందు ప్రత్యేకించబడియున్నది. అఖరునకు 18—22 యేండ్ల మధ్య ప్రాయములైన (వైద్యకారణాలచే మినహాయించబడినవారు తప్ప) విద్యార్థులందరును, చక్కగ పర్యవేక్షించబడునట్టియు, దేహకష్టముతో కూడినట్టియు, పనిని ఆరునెలల నుండి ఒక సంవత్సర కాలము వరకు చేయునట్లు జేయ సూచించబడి యున్నది. స్వచ్ఛంద పద్ధతిపై వచ్చెడు చిన్నజట్లతో తొలుత ప్రారంభించ బడును.

ప్ర. విద్యకు గల అవకాశముల విషయములో సంఘము నందలి నానాభాగముల మధ్యను, నానాప్రాంతముల మధ్యను ప్రస్తుతము గొప్ప అసమానతలు యేర్పడి యున్నవి. ప్లానింగ్ కమిషన్ యీ అసమానతలను యేవిధముగ తొలగింప సూచించియున్నది ?

ఉ. స్టేట్లమధ్యగల గొప్ప అసమానతలైనను తొలగ గలుగునట్లు, కేంద్ర ప్రభుత్వము యొక్క గ్రాంట్లు యొసగబడవలెననియు, వాని పంపకము గూడా అదేవిధముగ యేర్పాట్లు చేయబడవలెననియు కమిషన్ సిఫారసు చేసెను.

ఇటీవలి సంవత్సరములలో విద్య విషయమున గ్రామ ప్రాంతములు మొత్తముమీద ఉపేక్షించబడినవని కమిషన్ గుర్తించెను. కాబట్టి, బడి విద్యకు పూర్వపు, బేసిక్, సాంఘిక విద్య విషయములలో కమిషన్ ప్రాముఖ్యత నిచ్చెను. గ్రామ ప్రాంతములలో ఉన్నత విద్యయందు పరిశోధనలను జరుపుటకై ప్రణాళిక కాలమునందు కనీసము ఒక్క "రూరల్ యునివర్సిటీ" నైనను సంస్థాపించవలెనని ఆ కమిషన్ సిఫారసు చేసెను. గ్రామ ప్రాంతపు కళాభిజ్ఞులు, పనివారు, మేలైన పద్ధతులను నేర్చుకొనుటకు అవకాశమును గలిగియుండ రూరల్ ట్రెయినింగ్ సెంటర్లను స్థాపించవలెనని కూడా కమిషన్ సూచించెను. వెనుక బడియున్న జాతులవారి యొక్కయు, షెడ్యూల్డ్ తరగతులవారి యొక్కయు, విద్య విషయమున గూడా కమిషన్ ప్రత్యేక శ్రద్ధను జూపెను.

ఇతరుల విద్యతో పోల్చి చూచినయెడల స్త్రీల విద్య ఉపేక్షించ బడుచున్నదని కమిషన్ గుర్తించెను. ప్రాథమిక విద్యాభ్యాస దశలో బాలికలను, బాలురను కలిపి బోధించు విషయములో యేర్పడియున్న దురభిప్రాయమును తొలగించుటకై చక్కని ప్రచారమును జరుపవలెనని కమీషన్ సిఫారసు చేసెను. ద్రవ్య లోపముచేత ఆ దశలో బాలికలకు ప్రత్యేక పాఠశాలను యేర్పరచుట అసాధ్యమై యుండును. కాని. మాధ్యమిక. ఉన్నత పాఠశాల దశలలో, నేటి సంఘ స్థితినిబట్టి, బాలికా బాలురను యేకముగా గూర్చి బోధించుటకు వీలులేదు. కావున, ఆ దశలో బాలికలకు ప్రత్యేకమైన పాఠశాలలను స్థాపింప సిఫారసు చేయబడెను, స్త్రీలయొక్క ప్రత్యేకమైన పరిస్థితులనుబట్టి, ఇంటివద్దనే విద్య నభ్యసించి, పరీక్షలకు హాజరగుటకు అనుమతించబడవలెననికూడా సిఫారసు చేయబడెను.

ప్ర. బేసిక్ విద్యపట్ల ప్లానింగ్ కమిషన్‌యొక్క వైఖరి యేమి? దానిని, సాధారణ రకపు విద్యతో వారెట్లు జత పరచ నుద్దేశించియున్నారు?

ఉ. ప్రాథమిక విద్యదశలో బేసిక్ విద్యాపద్ధతి యుండవలెనని ప్లానింగ్ కమిషన్ నిర్ణయించెను. సాధ్యమైనంతవరకు ప్రాథమిక పాఠశాలలు నూతనముగ స్థాపింపబడుటను ప్రోత్సహింపరాదనియు, లభ్యపడెడు ఆర్థిక సంపదలను బేసిక్ విద్యాపద్ధతికి వాడవలెననియు ప్రస్తుతము ఉన్న ప్రాథమిక పాఠశాలలను బేసిక్ పద్ధతులమీద యేర్పాటు, చేయవలెననియు, ప్లానింగ్ కమిషన్ సిఫారసు చేసెను. సెకండరి విద్య విషయమున నేటి ఆ విద్యాపద్ధతిని గూర్చి విచారించుటకై ఇటీవలనే నియమించబడిన ఒక కమిషన్‌యొక్క సిఫారసులు యెట్లుం డునో చూడదగుననియు, అయినను, సెకండరి విద్య బేసిక్ విద్యతో చక్కగ జతపరచదగుననియు, అట్లొనరించినయెడల, బేసిక్ స్కూల్ నుండి సెకెండరీ స్కూలుకు చేరు పిల్లలు, పాఠ్య విషయములలోను బోధనా పద్ధతులలోను గొప్ప మార్పులకు పాలు గాకుండగలరనియు ప్లానింగ్ కమిషన్ తన అభిప్రాయమును తెలిపెను. యునివర్సిటీ దశలో "రూరల్ యూనివర్సిటీ" లను పేరుతో బేసిక్ పద్ధతిపై క్రొత్తరకపు విద్యయందు పరిశోధనలను సాగించవలెనని కమిషన్ సిపారసుచేసెను. ఈ రూరల్ యునివర్సిటీలయొక్క పట్టములు (డిగ్రీలు) ప్రభుత్వ ఉద్యోగములందు నియమించబడుటకు, సాధారణ యునివర్సిటీ డిగ్రీల విలువనే గలిగియుండును.

ప్ర. ఉపాధ్యాయులయొక్క సేవ స్థితులను, జీతముల స్కేళ్లను బాగుపరచుటకై ప్రణాళిక యేమి చేయ నుద్దేశించుచున్నది?

ఉ. ఈ దేశముయొక్క విద్యాలయములలోని అధ్వాన్నపు ప్రమాణమునకు గల ముఖ్య కారణములలో, ఉపాధ్యాయుల కివ్వబడుచున్న జీతముల స్కేలు చాలా తక్కువగా నుండుటయు, వారి సేవ స్థితులు అసంతృప్తికరముగా నుండుటయు, నొక కారణముగా నున్నది. కాబట్టి, ప్రతి స్టేట్ గవర్నమెంటు, వాని ఆర్థిక శక్తినిబట్టి, ఉపాధ్యాయుల జీతముల స్కేలును ఇతర సేవలతో పోల్చదగిన విధముగా యేర్పాటు చేయవలెననియు, దానికితోడుగా, ఉచిత నివాసస్థానమును, వారి పిల్లల విద్యాభ్యాసమునకు ఉచిత సౌకర్యములను, వగైరావంటి అదనపు సదుపాయములను కలిగించవలెననియు, ప్లానింగ్ కమిషన్ సిపారసు చేసెను. గ్రామ పాఠశాలలలోని ప్రతి ఉపాధ్యాయునికి, అతడును, అతని కుటుంబమువారును కాయకూరలను ఉత్పత్తి చేసుకొనుటకై, కొంత నేలను యిచ్చుటకు ప్రయత్నించవలెననికూడా కమిషన్ సూచించెను. వారికి వచ్చెడి స్వల్ప ఆదాయమును కొంత హెచ్చించుకొనగలుగుటకై, క్రింది తరగతుల ఉపాధ్యాయులకు "రిఫ్రెషర్ కోర్సు" లను సెలవుకాలములో నడుపుటకును, కార్మిక తరగతి పిల్లలకు సాయంకాల తరగతులను నడుపుటకును, సాంఘిక విద్యా కార్యములకు పూనుకొనుటకును, వారు స్వతంత్రమును గలిగియుండవలెనని ప్లానింగ్ కమిషన్ సూచించెను.

ప్ర. సాంఘిక విద్యయన నేమి? దానికి కమిషన్ యెట్టి ప్రాముఖ్యతను యొసగుచున్నది?

ఉ. పయోజన విద్యను, కేవలము, చదువుటకు, వ్రాయుటకు మాత్రమే పరిమితిపరచుట సంకుచితమని కనుగొనబడెను. కనుక

ఆ విద్యను కొంత విశాలపరచవలసిన అవసరము గలదు. ప్రయోజన విద్యలో, ఆరోగ్యమునకు సంబంధించిన సంగతులు, విశ్రాంతికాలమును సద్వినియోగపరచుకొను విధము, పౌరస్వత్వములను నిర్వహించవలసిన తెరగు, చేరునట్లు తలపెట్టబడెను. ఈ విశాల దృష్టితో నేర్పరచబడిన ప్రయోజన విద్యకే ''సాంఘిక విద్య''యని పేరిడబడెను. సాంఘిక క్రియలద్వారా సంఘాభ్యుదయకరమైన కార్యక్రమమని దాని అంతరార్థము. సాంఘిక విద్యకు కమిషన్‌వారు చాలా ప్రాముఖ్యతను యొసగిరి. ఈ సాంఘిక విద్య నిమిత్తముగా పంచ వర్ష కాలములో వెచ్చించబడుటకు ప్రణాళిక రూ. 15 కోట్లను ప్రత్యేకించెను. ఈ మొత్తము, విద్యా ప్రణాళికలో అభివృద్ధికొరకై వెచ్చింప నుద్దేశింపబడి యున్న దానిలో నూటికి 10 వంతున నున్నది.

# " వెనుకబడియున్న " తరగతుల శ్రేయోదాయములు

ప్ర. వెనుకబడియున్న తరగతులవారి స్థితులను బాగుపరచుటకు యీ ప్రణాళిక యేర్పాటుచేయుచున్నదా ?

ఉ. ఔను, వెనుకబడియున్న తరగతులవారి స్థితిగతులను బాగుపరచుటకై, ప్రణాళికలో ఒక ప్రత్యేకమైన అధ్యాయమునందు (XXXVII) కార్యక్రమములు వివరింపబడియున్నవి. ఈ కార్యక్రమములకై ప్రణాళిక కాలమునందు వెచ్చించబడుటకు మొత్తము రూ. 41 కోట్లు ప్రత్యేకించబడెను.

ప్ర. " వెనుకబడియున్న " ప్రజలలోని నానా విధములైన వారి ప్రత్యేకమైన అవసరములు యెట్లు తీర్చబడును ?

ఉ. వెనుకబడియున్న తరగతులవారి స్థితిగతులను బాగుపరచుటకై యున్న సకల కార్యక్రమములయొక్క ప్రధాన విషయము విద్యాభివృద్ధియైయున్నది. ఉచిత ప్రాథమిక విద్య, ఉచిత విద్యార్థి వేతనములు, ఉన్నత దశలో ఉచిత విద్య, పుస్తకములకు గ్రాంటులు, పరిక్ష రుసుమునిచ్చుట, ఉచితమైన హాస్టళ్లను నిర్మించుట, వృత్తికి సంబంధించినట్టియు, సాంకేతికమైనట్టియు, తరిఫీదునకు ఉపకార వేతనముల నిచ్చుట, ఇత్యాదుల మూలమున, వెనుకబడియున్న తరగతులకుజెందిన విద్యార్థులలో సాధ్యమైనంత యెక్కువమంది విద్యను, తరిఫీదును పొందునట్లు చేయుటకై ఒక ప్రయత్నము చేయబడుచున్నది. వెనుకబడియున్న తరగతికిజెందిన విద్యార్థులలో అర్హతగల యెవరుగానీ,

న లోపముచేతనైనను, లేక ఇతర సౌకర్యములు లేనందుచేతనైనను, వానికి యిష్టమైన విద్యను పొందక పోకుండునట్లు చేయుటయే ఆశయమై యున్నది.

వారు, యేదో ఒక వృత్తియందు స్థిరపడునట్లు తోడ్పడుటకై ఋణముల నిచ్చుటకును, సహాయ ధనము నొసగుటకును, సదుపాయములు యేర్పరచబడెను. అంతేనే గాక, ఇతర తరగతుల అభ్యర్థులతో పోటీ చేయవలసిన అవసరము లేకయే వారు ఉచితమైన ఉద్యోగము లను పొందగలుగుటకై పలు విధములైన సదుపాయములుకూడా వారికి యొసగబడియున్నవి.

షెడ్యూల్డ్ జాతులవారి విషయములోగూడా, ఆ జాతులవారి ప్రాంత ములలో రోడ్లను అభివృద్ధి పరచుటకును, వైద్య సహాయము, ఆరోగ్య సేవలు, లభ్యపడునట్లు చేయుటకును, ప్రత్యేక శ్రద్ధ పుచ్చుకొనబడు చున్నది.

